# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౦]  నవంబరు 1951  [సంచిక ౧౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయాధిక్యమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

చిత్ర జగత్తులో 'కావ్యగౌరవమును'
సంపాదించుగలి కళాసృష్టి

వాహినీవారి

# మల్లీశ్వరి



స్టూడియో
వాహినీ

నిర్మాత-దర్శకుడు
బి. యన్. రెడ్డి

త్వరలో వస్తున్నది

THE VAUHINI PICTURES LIMITED,
MADRAS — VIJAYAWADA — GUNTAKAL.

ముఖచిత్రము : “మల్లీశ్వరి” లో శ్రీమతి భానుమతి

# విషయసూచిక





(o)




ప ల్లె ప డు చు లు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# ప్రజావసరాలు

స్వాతంత్ర్య సమరంలో పాల్గొనేనాటి ఉత్సాహం యీనాడులేదు. ఏమూల చూచినను నిరాశ, నిస్పృహలు తాండవిస్తున్నవి. కరువుకాటకాలు ప్రజలను పీడిస్తున్నవి. ఆరోగ్య కేంద్రాలుకాని, వైద్యసహాయంకాని చాలినంతలేదు. అన్నివిధముల జనసామాన్యపు జీవితము దుర్భరంగా దినదినానికి పరిణమిస్తున్నదికాని ఆశారేఖలు ఎక్కడ కనుపించవు.

స్వతంత్ర భారతంగా యీనాటివరకు స్వపరిపాలనను చవిచూచాం. అది ఏపాటి సమర్థమయిందో ప్రజలకు తెలుసు. ప్రభుత్వ ప్రణాళికలు, వానియాచరణ ఎంత సమర్థంగా నిర్వహించబడినవో ప్రజలు పరిశీలించాలి. ఇంతవరకు జరిగిన అవకతవకలున్నచో రానున్న ఎన్నికలను అవకాశంగా చూచుకొని సమర్థమైన పరిపాలనా యంత్రాన్ని సమకూర్చుకోడానికి శాయశక్తుల ప్రయత్నించాలి. ఈ ప్రయత్నానికి విశాల హృదయం, విచక్షణాదృష్టి, వాస్తవిక పరిజ్ఞానాన్ని ప్రజలుకలిగి ప్రవర్తించాలి. సంకుచితతత్వాలు, స్వాభిమానము దేశపురోభివృద్ధికి తోడ్పడజాలవు; ప్రస్తుతపు దుస్థితి తొలుగదు.

ప్రజలకీనాడు కావలసింది ఏమిటి? తినడానికితిండి, కట్టుకోడానికిగుడ్డ, ఉండటానికియిండ్లు, వైద్యసహాయం; వానిని సమకూర్చడానికి ఏపార్టీ సామాన్య ప్రజానీకాన్ని దృష్టిలో నుంచుకొని పాటుపడ పూనుకొన్నదో పరిశీలించాలి. ప్రణాళికలనుచూచి మోసపోకూడదు. డబ్బుయిస్తామని, బావులు, గుళ్లు, గోపురాలు నిర్మిస్తామని ఆశ బెట్టి మీదగ్గరకువచ్చే పార్టీలనుకాని, వ్యక్తులనుకాని దరికిచేరనివ్వరాదు. మీ ఓటు ప్రస్తుతపు క్లిష్టసమయంలో చాల విలువయైనది. మీరు బాగా ఆలోచించి విశాల దృష్టితో వ్యవహరించిననేకాని ప్రస్తుతపు దుస్థితి తొలగదు.

ప్రస్తుత పరిస్థితులలో దేశకాల పరిస్థితులను క్షుణ్ణంగా నర్థముచేసికొని జాతీయ దృక్పథంతో ప్రజాజీవితాన్ని రూపొందించగల పార్టీని అధికారంలోకి తీసికొనిరావాలి. మన ప్రతినిధులుగా నెన్నుకోబడనుండువారు ప్రజల కష్టసుఖాలకు జబాబుదారీ వహించ గలవారుగా నుండాలి.

సంఘంలోనున్న వ్యభిచారము, బహుభార్యాతత్వము, వరశుల్కము మొదలగు దురాచారముల నిర్మూలనమునకు రానున్న ప్రజాప్రతినిధుల సభలు పూనుకొనవలసి యుండాలి.

దేశంయొక్క ఆర్థికవ్యవస్థను బాగా అర్థముచేసుకొని గృహపరిశ్రమల అభివృద్ధికి విశేషంగా అవకాశములు కల్పించబడాలి. అంటే భారీపరిశ్రమలను నిర్లక్ష్యంచెయ్యాలని కాదు. భారీపరిశ్రమలను, కుటీరపరిశ్రమలను ప్రభుత్వము సమానమైన దృష్టితోచూచి ఒకదానివలన మరొకదానికి విఘాతంలేకుండా వర్తకవ్యాపారాలను ప్రోత్సహించిననాడు దేశం సర్వతోముఖాభివృద్ధి నందుతుంది.

విద్యావిషయంగా యింకాపరిస్థితులు తృప్తికరంగాలేవు. కళాశాలలు, విద్యాలయాలు విస్తారంగా స్థాపించినంతమాత్రమున విద్యావ్యాప్తి కానేరదు. సులభంగా ప్రజలకు విద్య అందుబాటులోకిరావాలి. విద్యావిధానం స్త్రీలకు, పురుషులకు తగినరీతిగా సంస్కరించబడాలి. దానివలన వారు తమతమ విధులను దేశాభివృద్ధికి బాధ్యతతో నిర్వహించకలుగుతారు.

లలితకళల ప్రోత్సాహానికి ప్రభుత్వము కృషిచేయాలి. ప్రజలజీవితము విజ్ఞానవికాసములతోటి, ఆనందోత్సాహములతోటి రాణించడానికి అవసరమగు కళాకేంద్రాలను ప్రభుత్వము ఏర్పరచి నిర్వహించాలి.

పైవన్ని సమకూర్చబడి దేశము అభివృద్ధిచెందాలంటే ప్రజలుబాధ్యతతో తమ ఓటును వినియోగించిననాడే అవకాశముంటుంది.

# సోవియట్ దేశంలో పండ్లతోటల పెంపకం

విప్లవానికి పూర్వం రష్యాలో పండ్లతోటలకింద మొత్తంభూమి వైశాల్యం 655,000 హెక్టర్లకంటె ఎక్కువలేదు. రష్యా దక్షిణజిల్లాలలోనూ, మధ్యప్రాంతాలలో కొంతమట్టుకూ పండ్లతోటల పెంపకం జరిగేది. ఏపిల్సు, చెర్రీపండ్లు ముఖ్యంగా పండేవి. పండ్లతోటల్లో తక్కువ కాపుకాసే రకాలూ, మంచును తట్టుకోలేని చెట్లూ వుండేవి. 1 నుండి 3 హెక్టర్లకు (ఒక హెక్టరు $2\frac{1}{4}$ ఎకరాలు) మించి ఏతోటా వుండేదికాదు; తోట యజమానులు తమ యింటివాడుక కోసమే తోటలు పెంచుకునే వారు. జారిస్టు రష్యాలో పళ్లు ప్రజలకు అందరాని పళ్లు.

అక్టోబరు సామ్యవాద మహా విప్లవానంతరం, సమిష్టి వ్యవసాయ పద్ధతి విజయం పొందిన తరువాత పండ్లతోటల పెంపకం బాగా అభివృద్ధి అయింది. పండ్లతోటలు పెరిగే భూమి వైశాల్యం అతిత్వరగా పెరగడం ప్రారంభమైంది. ఈనాడు 1, 800, 000 హెక్టర్ల ప్రాంతంలో యీ తోటలను పెంచడం జరుగుతూంది.

మిచూరిన్ వ్యవసాయశాస్త్ర విజ్ఞానాన్ని విరివిగా ఆచరణలో పెట్టడం వలన అనేక ప్రాంతాలలో పండ్లతోటల పెంపకం అభివృద్ధి అయింది. ప్రకృతికి రూపులు దిద్దగలిగిన శాస్త్రవేత్త మిచూరిన్. మంచును తట్టుకోగలిగిన, పెద్దకాపుకాసే మంచి రకాల పండ్లచెట్లను, పెంచడానికి మార్గదర్శకుడయాడు. దేశపు ఉత్తర జిల్లాలలో కూడా పండ్లతోటలు పెంచడానికి సర్వ అవకాశాలూ సృష్టింపబడ్డాయి. దేశంలో కొన్ని జిల్లాల మట్టికీ, శీతోష్ణస్థితికీ అలవాటు పడే, పెద్దకాపుకాసే రకాల మొక్కలను అనేకం మిచూరన్ పెంచేడు. ఈనాడు అక్టోబరు విప్లవానికి పూర్వం పండ్లతోటలు పెరగని ఉత్తర ప్రాంతాలలో, అంటే యూరల్స్, సైబీరియా, దూర ప్రాచ్యజిల్లాలు, ట్రాంస్ కకేషియా ఆల్పైన్ జిల్లా ప్రాంతాలలో పండ్లతోటల పెంపకం జరుగుతుంది. 30 సంవత్సరాల క్రితం క్రాస్కో యూరస్క ప్రాంతాలలోనూ,, సైబీరియాలోనూ, మొత్తం 20 హెక్టర్ల ప్రాంతంలో మాత్రమే పండ్లతోటలుండేవి. ఈనాడు అవి సుమారు $3\frac{1}{2}$ వేల హెక్టర్ల ప్రాంతాలలో పెంచబడుతున్నాయి. పూర్వం అల్టేయ్ ప్రాంతంలో పండ్లతోటలే లేవు; కాని యీనాడు $2\frac{1}{2}$ వేల హెక్టర్ల భూభాగం మీద పండ్లతోటలు పెరుగుతున్నాయి.

సోవియట్ వ్యవసాయంలో పండ్లతోటల పెంపకం ఒక ముఖ్యశాఖ అయింది. చిన్న చిన్న పండ్లతోటలకు బదులు ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వాణిజ్యపంటగా పెద్ద పెద్ద పండ్ల తోటలు అవతరించాయి. వ్యవసాయ క్షేత్రాలలో యీపండ్లతోటలు 100 హెక్టర్ల ప్రాంతానికి పైగా వ్యాపించి వుంటాయి. అనేక వ్యవసాయ క్షేత్రాలలో ఇంతకన్న పెద్దతోటలుకూడా వున్నాయి. ఉదాహరణకు క్రాస్నడోర్ ప్రాంతంలోని స్లావ్యాన్స్ జిల్లాలోగల గోర్కీ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో ఒక పండ్లతోట 2300 హెక్టర్ల భూమి నాక్రమించింది; కజక్స్థాన్‌లోని ఆల్మా-అటా ప్రాంతంలోగల "గోర్కీ జయంట్" అనే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో 800 హెక్టర్ల భూమిమీద పండ్లతోటలున్నాయి.

సోవియట్ దేశంలో అధునాతన యంత్రాలతో కూడిన పళ్లూ, కూరల కేనింగ్ పరిశ్రమలు (పండ్లు వగైరా డబ్బాలకెక్కించి నిలవచేసే పరిశ్రమ) బాగా అభివృద్ధి అయాయి. విప్లవానికి పూర్వం

వుత్పత్తి కంటె 1949 లో డబ్బాల కెక్కించిన సరకు వుత్పత్తి 18 రెట్లు అధికమైంది. సోవియట్ కేనింగ్ పరిశ్రమ, రకరకాల పండ్లనూ, కూరగాయలను వాటి వాసన, గుణం చెడిపోకుండా డబ్బా కెక్కించి అధికంగా వుత్పత్తి చేస్తూంది.

అత్యధిక సంఖ్యల్లో వున్న శాస్త్ర విజ్ఞాన పరిశోధనా సంస్థలు పండ్లతోటల పెంపకానికి ఎంతో తోడ్పడుతున్నాయి. పండ్లతోటలగురించి యీనాడు ఆరు పరిశోధనా సంస్థలూ, 100 ఎక్స్పెరిమెంట్ స్టేషన్లూ పనిచేస్తున్నాయి. వివిధ జిల్లాలలోనూ, ప్రాంతాలలోనూ గల వ్యవసాయం యొక్క స్వభావాన్ని బట్టి అక్కడ పెంచవలసిన వివిధ జాతుల, రకాల పండ్ల మొక్కలను గురించి కొన్నిసూత్రాలను పరిశోధనా సంస్థలు తయారు చేసేయి. సోవియట్ దేశంలో సుమారు 1000 రకాల పండ్లమొక్కలు పెంపకమవుతున్నాయి; వాటిలో 55 రకాలు మిచురిన్ కనిపెట్టి పెంచినవి; 154 రకాలు అతని శిష్యులూ, అనుచరులూ పెంచినవి; 216 స్థానికమైన రకాలు ప్రజలు పెంచినవి. సోవియట్ యూరోపియన్ భాగంలోని మధ్యప్రాంతం పరిస్థితులలో పెరగగల మంచిరకం తియ్యటి చెర్రీపళ్లూ, ఏప్రికాట్ పళ్లూ పండింప బడుతున్నాయి, అలాగే యడారిలో పండే ఏపిల్ పళ్లూ, మంచునీ, చీడలనూ తట్టుకోగల స్ట్రాబెర్రీ, రాస్బెర్రీ, గూజ్ బెర్రీ పళ్లూ పండింప బడుతున్నాయి.

ఉత్పత్తివిధానాలను యాంత్రికంచేయందే పెద్దస్థాయిలో పండ్ల తోటల పెంపకాన్ని అభివృద్ధి చేయడం అసాధ్యం. పండ్లతోటలకు సంబంధించిన కష్టమైన పనులను యాంత్రికం చేయడానికి పరిశోధనా కేంద్రాలు అనేక రకాల యంత్రాలను డిజైన్ చేశాయి. సోవియట్ పరిశ్రమలు తోట ట్రాక్టర్ నాగళ్లు, ట్రాక్టర్లు, ప్రత్యేకట్రాక్టర్ హారోస్, మొదలైన యంత్రాలను తయారు చేస్తున్నాయి.

సోవియట్ దేశపు వివిధప్రాంతాలలో పండ్లమొక్కల పెంపక కేంద్రాలు నెలకొల్ప బడ్డాయి. ఆయాప్రాంతాలకు కావలసిన పండ్లమొక్కలనూ, అంట్లనూ ఆకేంద్రాలు పెంచుతాయి.

జారిస్టు రష్యాలో ఇటువంటి పండ్లమొక్కల పెంపక కేంద్రాలలో (నర్సరీస్) ఏడాదికి 25 లేక 30 లక్షల మొక్కలు మాత్రం పెంపకమయ్యేవి. కాని సోవియట్ పండ్లమొక్కల పెంపక కేంద్రాలలో ఏడాదికి 3 కోట్ల 50 లక్షలనుండి 4 కోట్లపండ్ల మొక్కలూ, ఇంకా అనేక కోట్ల పువ్వుల మొక్కలు పెంపక మవుతున్నాయి. త్వరలోనే యీకేంద్రాలలో 8 కోట్ల పండ్లమొక్కలు పెంపకమవవచ్చును. అప్పుడు ప్రతి ఏటా 175, 200, 000 హెక్టర్ల ప్రాంతంలో పండ్లతోటలు పెంచడానికి అవకాశం కలుగుతుంది.

ఓల్గా, నీఫర్ నదీతీరాల్లో హైడ్రో ఎలక్ట్రిక్ కేంద్రాలు, ప్రధాన తుర్క్మేనియన్, దక్షిణ యుక్రేనియన్, ఉత్తర క్రిమియన్ కాలువలు, వోల్గా-డాన్ కాలువ, వీటినిర్మాణం నీటివసతులుగల భూములపై పండ్లతోటలను అత్యధికంగా పెంచడానికి అనుకూలమైన పరిస్థితులను కలుగ జేస్తాయి.

ఈనాడు యీజిల్లాలో పరిశోధనా సంస్థలు పెద్దస్థాయిలో పనిసాగిస్తున్నాయి; అన్నిఋతువులలోనూ పెరిగే మొక్కలకు కావలసిన మట్టిని పరిశీలిస్తున్నాయి. పరిశోధన సాగిస్తున్నాయి. ఈభూములలో వివిధరకాల పళ్లూ, ద్రాక్షపళ్లు పండించడానికి మార్గాల నన్వేషిస్తున్నాయి.

ప్రకృతి పరివర్తన గావించడానికి స్టాలిన్ ప్రణాళిక ననుసరించి రక్షణ కంచెలలో నూటికి 10 నుండి 15 పాళ్లు పండ్ల చెట్లుంటాయి. దీనివల్ల సోవియట్ దేశంలో పండ్లతోటలు పెరిగే భూభాగం ఇంకా ఎక్కువ అవుతుంది.

'టాస్' నుండి

—(०)—

# సమాశ్వాసము

శ్రీమతి చుండూరి రమాదేవి.

ఏటికి మాటి మాటికిని, యింతిరో దిక్కులు చూచెదవున్న నీ
కేటికివట్టియాసలిక, యీగతి వాకిటనిల్వనేల యీ
నాటికి దాటిపోయెనుమి నాథుడువచ్చెడు రైలుబండ్లు నీ
ఆటలకత్తెలెల్ల పరిహాసముచేతురు చూచిరేనియున్ ॥

నిలచి, నిలచినపాదాలు, నెత్తురూది
ఎఱ్ఱ తామరలట్లయ్యె, యెరుపుచింది
చూచి, చూచినకడగంటి చూపులెల్ల
నల్ల కల్వలతోరణాల్ నాతిగట్టె ॥

ఏదియొ సాకుబూనియిటు, యింటను పాదములానబోక నీ
కేదియొ యాసడెందమున, ఏడ్తెరతోందరవెట్ట యింటికిన్
వీధికిసారెసారెకును, వేసరునట్లుగ తిర్గెదీవు తే
పాదయుగంబునొచ్చునని, బాలరో నామదిబాధకల్గెడున్ ॥

ఇంటను యెరుకలేనితరి, యింతిరో నీ కడగొట్టుతమ్మునిన్
జంటకువ్రేళ్లచే శకున, జాడలు చెప్పుమటంచుకోర యీ
తుంటరిబాలుడొక్కపరి, ధూర్తతవ్రేళ్లను రెండుబట్టి నీ
కంటను నీరునిల్పెదవు, కాంతరో యెంతటిబేలవో గదా ॥

సెలవు లీకేదొ యేమొ నీ చెలువునకును
కార్య తత్పరుడౌచు యేకడకుజనెనొ
కాక రాకున్నె? నినుచూడ కాంక్షలేదె?
యింతలో నీకు యీవల వంతలేల?

పండుగచేరువయ్యెనిక, బాలరో నీపతి రాడటంచు లో
నెండుగకుందబోకుము, మేలగునీకు భవన్మనోహరుం
డుండునుసుమ్ము నీదరని ఒప్పుగ పండుగనాటికిన్ హృదిన్
నిండు వహింపుమమ్మ తరుణీమణి నాగమయ స్వరూపిణీ ॥

# వరశుల్కము



శ్రీమతి క. పద్మావతీదేవి.

## ౧

## సాంఘిక దుస్థితి

నేత్రములా తామరరేకులంబోలె దీర్ఘములు, విశాలములు. కురులు నల్లని కాటుకరంగుతో పిరుదల వరకు వ్రేలాడుచున్నవి. మేనుపచ్చని బంగారమువంటి ఛాయ, వయస్సు పదునొకండు సంవత్సరములు. పాఠశాలలో 1 వ ఫారము చదువుచున్నది. సంగీతమునందు మిక్కిలి ప్రీతి. దీనులయెడ జాలిమెండు. పాపము! సుశీల యిప్పటిబాలికలవలె ఆభరణములులేక మెడలో సన్ననిచైను, చెవిలో స్టార్లుమాత్రమే కలవు. సుశీలకు రాట్నమనిన నెంతయో ప్రియము. తీరుబాటు సమయములందెల్లప్పుడు కాలము వ్యర్థముచేయక రాట్నము ద్రిప్పుచు ఇరువదియవనెంబరువరకు రాట్నముపై నూలుందీయుట కలవాటుపడెను. ఆమెకు ఖద్దరుకట్టుట యందే అభిలాష.

సుశీలకు ఇద్దరక్కలును, నొకసోదరుడునుంగలరు. సోదరుడందరిలోను చిన్నవాడు. తండ్రిపేరు కృష్ణయ్యగారు. సాధారణ సంపన్న గృహస్థుడు. తనకు భూమిపైవచ్చు నాల్గువందల రూపాయలతోను, ఋణముచేయక తనభార్యను నల్గురుపిల్లలను బోషించుచుండెను. పెద్దకుమార్తెయగు సత్యవతికి ఆనోన్నదకములుగల సంబంధముచేయనెంచి యెక్కడను తగుసంబంధము దొరకక, వెదకివెదకి చివరకు వెయ్యినూటపదహార్లు కట్నమిచ్చి భూవసతిలేని ఒకస్కూలుఫైనల్ విద్యార్థికిచ్చి వివాహముచేసెను, పాపమామె రజస్వలయైన మొదటిసంవత్సరమే యాపెభర్త కాలగతినొందెను. కృష్ణయ్య తనపెద్దపుత్రిక వివాహమునకుచేసిన రెండువేలరూప్యముల ఋణముదీర్చుటకు, సాలునకు నూరురూపాయలు ఆదాయమువచ్చు తన రెండుయకరముల పల్లపుభూమిని విక్రయించి సత్యవతినిగూడ తనగృహమందే యుంచుకొని కాలముగడుపుచుండెను.

కృష్ణయ్య తనపెద్దకుమార్తెకు వివాహముచేసిన మరువత్సరముననే, ద్వితీయపుత్రిక అన్నపూర్ణకుగూడ వివాహము చేయవలసివచ్చెను. సత్యవతికి వరుని వెదకుటకే పడరానిపాటుపడెను. రూపముకలవానికి గుణవిద్యలు లేవు. విద్యగలవానికి వసతిసున్న. వసతికలవానికి వయసుతక్కువ. మఱియునిందేతరగతి వానికైన వేలకువేలు కట్నములు. ఇటిస్థితిలో అన్నపూర్ణకు వివాహముచేయుట కెటులనుతోచకుండెను. తాఁదిన్నదెల్ల తెగనమ్మి యల్లురకు కట్నములొసగి, తనఏకపుత్రుని కక్షయపాత్ర చేతికివ్వజాలడు, కట్నము లివ్వక తనగారాబుపట్టిని అన్నములేనివానికి విజ్ఞానహీనునికిని పరిణయము చేయనొల్లడు. హా! దైవమా! ఎటులనాగతి విచారించి, విచారించి, తుదకు ఆరువందల రూప్యములు వరునకును, వందరూపాయలు వరుని తల్లికిని, వందరూపాయలు పెండ్లికుమారుని అప్పచెల్లెండ్రకును, ఎనిమిదివందలవరకిచ్చి యామెను పెండ్లి చేసెను. తరువాత ఒకవత్సరముగడచెను.

## ౨

మనసుశీలకప్పుడే పదునొకండవవత్సరము. వివాహము చేయుసమయము దాటుచున్నది. కృష్ణయ్యభార్య సుశీల వివాహముసంగతి జ్ఞప్తికిదెచ్చుచు కోతలుకోయుచుండెను. కృష్ణయ్య ఇదివరకే తనకువచ్చు నాదాయమందు సాలుకు నూటయెనుబది, రూపాయలు ఆదాయమువచ్చుభూమిని సత్యవతి అన్నపూర్ణల వివాహము నిమిత్తము విక్రయించెను. యికమిగిలిన ఆస్తితో తనకుటుంబపోషణ యెట్లుజరుగును? తనయనుంగుపట్టి వివాహము చేయుటెట్లు? సుశీలకు వివాహముచేసి తనఏకపుత్రునికి విద్యాబుద్ధులుగఱపి, యాతనినొక కుటుంబీకునిచేసి పోషించుటెట్లాయని, తనలో తాను గుందుచుండెను. భార్య జ్ఞప్తికితెచ్చునపుడు అన్నముసహించదు.

కంటికి రాత్రికూర్కురాదు. రాత్రి పండుకొనపుడెల్లా "రామచంద్రప్రభూ! ఏలనన్నీలీల సృజించితివి? విస్పజించియు నేల యీ సంసారము కల్పించితివి. కల్పించితివిపో ఆడుసంతానమేల యిచ్చితివి; అందును బెక్కు పుత్రికల నేలనొసంగితివి తండ్రీ ఏమూఢాత్ముడీ కట్నముల బెట్టెనోకదా! సామాన్య కుటుంబములెన్నియో వరకట్నములచే గుల్లలగుచున్నవో కదా! నాబోటివారనందఱ రూపుమాపుటకీ వరకట్న పిశాచమందరిని కూడ యావహించుకొనియున్నది. తండ్రీ! నన్నీసముద్రమునుండి ఎట్లుదరిచేర్చెదవు స్వామీ" యని విచారించుచుండును.

ఇది యిటులుండ అన్నపూర్ణభర్త తనకుమరల మూడువందలరూప్యము లిచ్చినగాని ఔపాసన కార్యమును జరిగించుకొననని అలిగికూర్చుండెను. గోరుచుట్టుపై రోకటిపోటు అన్నట్లు ఇది ఏమి భగవంతుడా! గొప్పగొప్పవారు పెద్దలు, అందరుకూడ వివాహమునకు గట్నములనుచుబెట్టి సామాన్యసంసారములను మట్టుపెట్టుచున్నారు. ఇప్పుడు గర్భాదానమునకుకూడ కట్నమేమిరా! అల్లునికికట్నమివ్వనా! కూతునల్లునికడకు పంపక ఊరకుండనా? యని కృష్ణయ్య విచారించుచుండెను.

రోజులు జరుగుచున్నవి. ఎక్కడ ప్రయత్నించినను సుశీలకు సంబంధము కుదురలేదు. పదునొకండవ సంవత్సరము దాటుచున్నది. రజస్వలయైన చిక్కు, సాధారణముగ ఎక్కడకు వెళ్లినను సంబంధమునకు ఏదోఒక మచ్చ యుండక తప్పినదికాదు. స్వగ్రామములో వాసుదేవ శాస్త్రిగారి కుమారుడు, శ్రీరామమూర్తి అను యువకుడొకడు అన్నివిధముల నచ్చినవాడుండెను. గాని యాతడు పెద్ద ఆస్తి కలవాడగుటచే వేలకొలది కట్నములడుగునేమో యని భయపడి యాసంబంధము కొఱకు ప్రయత్నించక మిన్నకుండెను.

ఇట్లుండ కృష్ణయ్య అగ్రహారములో నొకసంబంధమున్నదని తెలిసి యచ్చటకు వెళ్లెను. వరుడు బి. ఏ. తరగతియందు చదువుచున్నాడు. హూణవిద్యకై విక్రయించినందున బి. ఏ. యను యక్షరములు రెండుతప్ప వసతిసున్న. వేదాధ్యయన పరుడు. వసతి సంగతి దెలిసికొనుటకు కృష్ణయ్య అగ్రహారము పోయినపుడు ఆవరునకాదాయమేమి లేకున్నను ఆతనికి సాలునకు నాల్గువందల రూపాయలు వచ్చునని అగ్రహారములోని వారిల్లరు చివరకు కృష్ణయ్యగారి బంధువులు గూడ బల్కుచుండిరి. కాని కృష్ణయ్య పాపమిది యంతయు కల్లయని తెలిసికొనజాలకుండెను. ఎటులైనను బాగున్నదని తలచి సుశీలకు వివాహము చేయుట అతితొందర యగుటచేతను, ఇప్పటికే సంబంధమునకు చాలకాలమునుండి తిరుగుచున్నందునను, ఈసంబంధమును స్థిరపరచుకోవలెనని నిశ్చయించుకొనెను.

వరుని యింటిపేరు సత్యవరపువారు. తండ్రి వీరావధానులుగారు. ఇంతదనక కట్నములను దీసికొనుట పుత్రులను విక్రయించుట యనియు, పరులకు సొమ్ముకొఱకు అమ్ముబడినవాడు తన నిశ్చసుతుడు గాడనియు, ధర్మపన్నములు చెప్పుచుండెడి ఘనుడు. ఈ వీరావధానులుగారు తన కుమారుని పదునైదువందలకు బేరము పెట్టినారు. ఎవరయిన పెద్దలు "ఏమండీ మీరు కట్నములు కూడవని పల్కెడివారు కదా? ఏమిది? యని" పలుకగ ఏమిచేయను బాబు మా అబ్బాయి, బి. యే. చదువుచున్నాడని ప్రతివాడును సంబంధము కొఱకు వచ్చుట తోడనే వందలకొలది కట్నమిచ్చెదమని పల్కుచున్నారు. మేమడుగకుండనే వారిచ్చెద మన్నప్పుడు మేమెట్లు మానుకొనగలము? అయినను కట్నము కొఱకు వేధించు మాస్త్రీలమాటలు తీయుటకు వీలుచిక్కినదికాదు." అని చెప్పుచుండెడివాడు. కృష్ణయ్య గోత్రాదుల నెల్లను తఱచి చూచి అడ్డులేదని తెలిసికొని చివరకు వేయిరూప్యములు రొక్కమున్నూ యింకను యేవియో లాంఛనములు యిచ్చుటకు యేర్పరచుకొని తాంబూలము చేతబెట్టి ముహూర్తము పెట్టుకొని నిజగృహమునకు పోయెను.

ముహూర్తము మాఘశుద్ధ పంచమి. అప్పటికి సరిగా నొక మాసమున్నది. కృష్ణయ్య యొక్కచోట పదునైదు వందల రూప్యములు బదులుతెచ్చి వివాహ ప్రయత్నములు మిక్కిలి చురుకుగా జేసుకొనుచుండెను. వివాహము పదిదినములున్నదనగా నాటిమధ్యాహ్నము తపాలా మనిషి మూడుగంటలకు కృష్ణయ్యగారికి ఒక యుత్తరము దెచ్చెను.

ఆయుత్తరమును దీసుకొని కృష్ణయ్య తనలో చదువుకొని నిర్ఘాంతపోయి పెద్దనిట్టూర్పు విడిచెను. అందిట్లున్నది.

అగ్రహారము, పుష్యబహుళ గురువారం.

అయ్యా!

నాకుమారునకు కొన్నటిరోజున నొకరువచ్చి పన్నెండువందల రూప్యముల రొక్కమున్నూ, లాంచనములున్నూ, ఉభయఖర్చులున్నూ పెట్టుకొని పిల్లనిచ్చుటకు వచ్చియున్నారు. నాల్గురోజులలో కబురు చేసెదమని వారిని బంపితి. మీయభిప్రాయ మేదియో తెలుపవలయును.

చిత్తగింపుడు
స. వీరావధానులు

ఆహా ఏమి! కలికాలమహిమ! నిశ్చయింపబడిన సంబంధమెట్లు తిరిగిపోయినది. ఈరోజులలో ఈవరకట్నము లెంతటి పండితునకైన తుచ్ఛపు పనులకు బాల్పడ చేయుచున్నవి.. ఏ నీచుడో నిశ్చయింప బడిన సంబంధమునకు ఎక్కువ కట్నమిచ్చెదనని కాసించి యీబ్రాహ్మణుడిట్లు చేసెగదా. నేటిదినములలో బ్రతివాడును పుత్రులను సంతలో గిత్తవలె నమ్ముకొనుటయే కాక నిర్ణయించబడిన బేరములను కూడ ద్రోసి పుచ్చుచున్నారు. అందును అగ్రగణ్యులమని చెప్పుకొనువారే యిట్లాచరించుచుండ తక్కినవారి మాటలిక లెక్కయేల అని కృష్ణయ్యగారు తనలోననుకొనుచు మనస్సున నెంతయు వగచి ఏమిచేయుటకును వీలులేకను, ఇక సంబంధముల కొఱకు తిరుగలేకను, వివాహ ప్రయత్నములన్నియు పూర్తియగుటచేతను, యేమియుతోచక తానును తనస్నేహితు నొకని వెంటబెట్టుకొని అగ్రహారమునకు బయలుదేరెను. వారిద్దరును అగ్రహారమునకు పోయి వీరావధానులుగారితో "అయ్యా తమకిది తగునా? నిశ్చయమైన సంబంధము నిట్లు త్రోసివేయుదురా?" యని యడుగ, "డబ్బుయిచ్చెదమని వచ్చుచుండగా ఏమిచేయమయ్యా?" యని బదులు చెప్పెను. అందుమీద వీరిద్దరును యికచేయునదిలేక ప్రయత్నములు పూర్తియగుటచే వివాహమునకయ్యెడి యుభయుల ఖర్చులను గూడ కృష్ణయ్యగారే వహించి వివాహము జరుపుటకు నిశ్చయించుకొని తిరిగీ యింటికి వచ్చిరి.

పెండ్లి నాల్గుదినములున్నది. బందుగుల నందరును పిలుచుకొనిరి. బంధుగులు నంద రొక్కరొక్కరే రా మొదలిడిరి. సుశీల పెండ్లికూతురాయెను. అందరును ఎట్టకేలకు సంబంధము నిశ్చయమయ్యెగదాయని సంతసించుచుండిరి. కృష్ణయ్యగారి యిల్లు వివాహశోభచే కలకలలాడుచుండెను. ఒక యువకుడింతలో "కృష్ణయ్యగారిల్లిదేనా" యని సైకిలునుండిదిగి ప్రశ్నించి "కృష్ణయ్యగారున్నారా" యని యడిగెను. కృష్ణయ్యగారు బయటకేగి ఏమని నాయువకుని అడుగగా, నాతడొక కవరు నాయనకిచ్చెను. కృష్ణయ్య యాకవరునందుకొని చింపి దానిలో కాగితముదీసి యందుండునది హూణభాష యగుటచే తెలియక తనయింటికి బంధుత్వమునకై వచ్చిన యొక యువకునిచేతి కా కాగితమునిచ్చి చదువమనెను. అందిట్లుండెను.

Agraharam

My son not willing marriage this year. No marriage.

S. Veeravadhanulu

(సశేషము)



# ఝాన్సీ రాణి

శ్రీమతి వల్లభనేని రంగాదేవి

[ప్రథమాంకం - ప్రథమ రంగం]

[ప్రదేశము- మేజర్ ఎలిస్ ఆఫీస్. మేజర్ ఎలిస్ - మిస్టర్ బేకర్ - మీర్ చంద్ - సదాశివ్-లు కూర్చుండి రహస్య సంభాషణలు జరుపుతుంటూ వుంటారు.]

ఎలిస్:- మైడియర్ ఫ్రండ్! మీకు తెలుసా- అది మంచి అవకాశం. మీకు గవర్నర్ జనరల్ ఆఫ్ యిండియా... క్షమించండి నాకు హిందీ బాగారాదు. అయినా ప్రయత్నిస్తాను. ఆంగ్లరాజ్య మిత్రులారా! మాల్కమ్ హేలీ నెరుగున్నారు గదా? పొలిటికల్ యేజంట్ ఆఫ్ బుందేల్ ఖండ్, మీకెల్లరకు నమస్కారాలని చెప్పమన్నాడు. వారి, రికమండేషన్ పై - గవర్నరు జనరల్ గారు, ఝాన్సీ రాజ్యాన్ని ఆంగ్ల రాజ్యంతో విలీనమొనర్చ దయతో అంగీకరించారని కూడా చెప్పమన్నారు. మీరంతా ఆంగ్ల రాజ్యానికి సహాయం చేయాలి. బహుమతి పెద్దగా ముట్టజెప్ప బడును. ఆంగ్ల ప్రభుత్వం పారితోషికం యిస్తుంది. మీరావిధంగా ప్రవర్తించారా పరమ సంతోష మన్నమాట. వారు చెప్ప మన్న విషయమిదే. యేం మిస్టర్ బేకర్?

బేకర్:- రైట్ సార్!

మీర్ చంద్:- కాని... మేజర్ ఎలిస్ సాహబ్! ఇది బహు కష్టమైన కార్యం. ఝాన్సీ రాజ్యమును ఆంగ్లరాజ్యాంతర్భాగంగా విలీన మొనర్చుకోవడ మంత మంచిగా పరిణమించదేమో. తిరుగు బాటు రావచ్చు కూడాను. ప్రజలెల్లరూ రాజ వియోగ దుఃఖము మరువనైనా లేదు. యింతలో యీ వజ్రపాతమా! మిన్ను విరిగి మీదబడును. విధవయగు రాణి యేమగునా యని మీపై భార మేసి కూర్చుండి యుండిరి? ముందు వెనుకలాలోచించి ముగ్గులోనికి దిగుట మంచిదని నాయభిప్రాయం.

సదాశివ్: అవును మంచిది మిస్టర్ ఎలిస్. రాజు మరణసమయమున దామోదర్రావును దత్తు తీసుకొనెను. చట్ట ప్రకారం ఝాన్సీ రాజ్యాని కధికారి దత్తపుత్రుడే. రాజ్యపాలనా వ్యవహారాలు నిర్వహించ రాణివుండనే వుంది.

అలాంటప్పుడు బలవంతముగ ఝాన్సీ రాజ్యాన్నిందు గలుపు కొనెడిదెట్లు? నాకేమియును పాలు పోవడం లేదు. ద్రాక్షపండ్లు రుచిగానే యుండును గాని, అందకున్న పుల్లనేనా?

ఎలిస్:-మీకర్థంకాదు. అది నిర్ధారణఅయిన యదార్థం. కలకటా కౌన్సిల్లో యీ తీర్పు జరిగింది. పీలైనంత తర్వలో అలాటి లెటరు వస్తుంది. గవర్నర్ జెనరల్ స్వయంగా వ్రాస్తాడు. మీరెందుకు భయపడెదరు?

బేకర్:-మీరు చెప్పింది నిజమే. కాని అది కష్టతరమైన సమస్య. అది ఝాన్సీ రాష్ట్రానికి, రాణి విషయంలో న్యాయమేనా! అని మనమడుగవచ్చు.

ఎలిస్:-ఎందు కడగకూడదు. అది బ్రిటిషు ప్రభుత్వముయొక్క ధర్మము. నాకు తెలుసు బేకర్! 1836 సం॥ మార్చి పద్దెనిమిదవ తేదిన కోర్టు అఫ్ డైరక్టర్సు జాబు ప్రకారం పదహారు పదిహేడు చట్టమునకిది విరుద్ధం. బ్రిటిష్ గవర్నమెంట్ ఝాన్సీ రాజ్యాన్ని ఆక్రమించుకున్నా, దత్త పుత్రుని అంగీకరించక పోయినా - స్వహస్తాలతోనే - స్వనాశనాన్ని కొని తెచ్చుకోవడమంటే - ఐ థింక్ సో మిష్టర్ బేకర్ - అదియొక ప్రశ్న కాదు. న్యాయాన్యాయముల విచారణ మనకవసరము లేదు. మన ధర్మాన్ని మనము నిర్వర్తించాలి. మీ భారత దేశం తప్పు చేసింది. మిష్టర్ బేకర్! ఇండియాలో మనము బ్రిటిష్ పాలసీయొక్క అణువులము మాత్రమే. అలాగనే ప్రవర్తించాలి. మన మెలామెలిగిన బ్రిటిష్ రాజ్యము విస్తరించునో చూడ్డం మన ధర్మం. తదితర విషయాలు మనకెందుకు?

బేకర్:-మీరు సెలవిచ్చిన ట్లే సార్. తమ చిత్తమొచ్చిన ట్లే. కాని పథకమేమిటో నిర్ణయించాలిగా.

ఎలిస్:-పథకం? పథకం - విభజించి పరిపాలించడం యిప్పుడీ ప్రజలతో సంప్రదించాలి. డియర్ ఫ్రెండ్స్! మీరు గనుక సహాయపడితే మిమ్ము కుబేరుల జేసెదము. మున్ముందటికీ మాకు సహాయపడి స్నేహితులుగావాలని కోరుతున్నాం.

మీర్ చంద్:-అయ్యా! నేనెప్పుడూ ఇంగ్లీషు ప్రభుత్వానికి దాసాను దాసుడనే. కాని నాకు ప్రతిఫలం అంతగా ముట్టడం లేదండి. వాగ్దానాలు వ్యర్థమైపోతున్నై. లేకుంటే నేను బ్రిటిష్ ప్రభుత్వంకొరకు ప్రాణాలివ్వడానికైనా సిద్ధమే. నేనేమి జేయాలనో చెప్పండి? కాని ... అయ్యా! బహుమతి ఘనంగా నుండాలి.

ఎలిస్:-ఓ యస్. భయమక్కర లేదు. పాలనా వ్యవహారాలు నేను చూస్తుంటాను.

నీవు నాకు సహాయం చేస్తుండు. నీకు రెట్టింపు జీతం ముట్టుతుంటుంది. నీడ్యూటీ కూడా దర్బారులోనే. రాజ్యం వేరైందన్న వార్తవిని గడబిడ కానివ్వకు దర్బారులో. శాంతి జరుగుతుంది. అనంతరమంతా చక్కబడుతుంది.

మీర్ చంద్:- నాకీ కార్య మొకలెఖ్ఖా ? ఇదొక యెడమచేతిపని. అతిసులువైనట్టిది. ముందు వెనుక లాలోచించి కార్యాన్ని సాధించడంలో మావంశం పేరెన్నిక గన్నది. మీదయ వుండాలి గాని ఆడుతూ పాడుతూ యీపనంతా చక్కబెట్టెదను ?

ఎలిస్:- థేంక్ యూ మిష్టర్ మీర్ చంద్. మీ బోటి భారతీయ స్నేహితులే మా కార్యములు సమకూర్చి పెడుదురు. మిష్టర్ సదాశివ్ ! నీ కేంకావాలి మీ అభిప్రాయం చెబితే – మేమందుకు ప్రయత్నిస్తాం.

సదాశివ్:- మీ కొరకీ సదాశివ్ కొండమీది కోతిస్సైనా దించుకురాగలడు మీరు చెప్పినది చేయుటకు సంసిద్ధం. కాని అయ్యా! రాజు ననిపించుకోవాలన్న కోర్కె ఒక్కటున్నది. ఝాన్సీ సింహాసనమే మనకు ప్రాప్తించినట్లైన మీదయ వల్ల నేనుద్ధరింపబడుదును. జీవితాంతం ప్రభువులకు దాసుణ్ణే. నాకు వేలాది సైన్యముంది. కనుసైగతో కదనభూమిన ప్రాణాలర్పించ సంసిద్ధమైయుందును.

ఎలిస్:- ఓ ... అర్థమైనది. మిమ్ముల రాజు నొనర్చెదము. మీరు ఆంగ్ల ప్రభుత్వానికి పూర్తిసహకారమిచ్చిన – పై అధికార్లతో మాట్లాడి మిమ్ము కింగ్‌ను జేస్తాను. ఒకవేళ ఝాన్సీ రాజ్యం మనప్రభుత్వానికి లభించకున్నప్పటికీ నీకిస్తాం. యేమంటావు ?

సదాశివ్:- అయిదువూళ్లిచ్చినాచాలు. అంతవరకే రాజునై వేరేయుంటాను.

ఎలిస్:- ఇదేముందిలేగాని ... మీరు మా లోనే వుండాలి.

సదాశివ్:- అట్లైన సదాశివ్‌ను తమ దాసుడుగా యెంచుకోండయ్యా ! మీకను సైగల్లో మెలగుతుంటాను. మీయాజ్ఞ శిరసావహిస్తాను.

బేకర్:- ఎక్స్‌క్యూజ్ మిసార్ ! యిందులో తొందరపాటు వలదంటాను. టైమివ్వడం మంచిదంటాను.

మీర్ చంద్:- కాదండయ్యా! శుభకార్యములందు ఆలస్యం మంచిదిగాదు. మాలో శుభస్య శీఘ్రమ్ – అన్న సామెతకూడా వుంది.

సదాశివ్:- ముద్దొచ్చినప్పుడే చంకనెక్కాలి. రక్తం వేడెక్కివున్నప్పుడే వారిని వుపయోగించుకోవాలి. సులుసూత్రంగా ఝాన్సీ మనస్వాధీనమయ్యే పరిస్థితుల్లో వుంది. కాబట్టి ఆలసించరాదు.

ఎలిస్:-మీరు ఉన్నదున్నట్లుగా చెప్పారు. నాకూ అదే యిష్టం. వీలైనంత త్వరలో నీ పనిని ప్రారంభము చేయమంటాను. స్వయంగా నేనే కాలేఖాం సేనాపతిని లోబరచుకుంటాను. ఏ విధంగానైనా సాధిస్తాను. మిష్టర్ మీర్‌చంద్ హుషార్‌లో వుంచాలి. క్వీన్ ఆఫ్ ఝాన్సీకి గవర్నర్ జెనరల్ లెటరు అందనంతవరకు యేమీ మాట్లాడకూడదు. తెలిసిందా? యేం మిష్టర్ బేకర్?

బేకర్:-ఆలాగే సార్! నేను దాసుడను.

ఎలిస్:-దెన్; సమావేశము చాలింతము. మిష్టర్ మీర్‌చంద్! మళ్లీ కలుసుకో.

మీర్‌చంద్:-ప్రభువులకు జయము కలుగుగాక.

సదాశివ్:-ఆంగ్లరాజ్యానికి జయమగుగాక.

ఎలిస్:-వెల్ వెల్. (కరస్పర్శ - అనంతరం నిష్క్రమణ.)

(ప్రథమాంకం - ద్వితీయరంగం)

[ప్రదేశం-రాజభవనమందొక భాగం - కరవాలములు వ్రేలాడుచుండు నొక గోడన, రాణి వైధవ్య దుస్తులు ధరించి, ఏకాంత సమయం లభించ పాటలు పాడుచుండును. గీతాగానం సమాప్తమైన తదనంతరం కిరణ్ వచ్చి మెదలక నిలబడిపోవును.]

ప్రళయాగ్ని కీలలా
పడియుండి కూడనూ
పకపకా - నవ్వుటే
పౌరుషం బెరుకెగా!
... ... ... ...
కంటకా వృతమున
కాహ్లాద మందుటే
పురుషార్థమని-పుడమి
పూజాతి-బలికెగా!
... ... ... ...
అగ్నిజ్వాలలబిల్చి
బుగ్గియై పోవుటే
జీవితార్థంబంటు
శలభాలు-చాటెగా!
చీకటిదింటూ
సిథిలంబవుతూ
వెలుగుకై యోగ్యుల
గుణమనె-దీపం!
... ... ... ...
చావగలేని
చవటల బ్రతుకూ
మండగలేనీ
బండల బ్రతుకూ
ఒక బ్రతుకేనా?
... ... ... ...
బ్రతికియుకూడా
బ్రతుకజాలనీ
బడుద్ధాయిలా
బ్రతుకొక బ్రతుకా?
... ... ... ...

(సశేషము)

# అనాథ



శ్రీ. డి. రాజేశ్వర్

మధ్యాన్నం 12 గంటల వేళయైనది. ప్రచండ భానుడు తనజ్వాలల ప్రభావముచే తీక్షణముగ మింట ప్రకాశించుచున్నాడు. బాటసారులకు మీదను నెత్తి, క్రిందను కాళ్లు మండిపోవుచున్నవి. భూపరి పరిమారుతముగూడ వేడెక్కి శరీరమంతయు స్వేదమయమగుచున్నది. అట్టితఱి నేను బజారునుండి యింటికి వచ్చుచున్నాను. మార్గమధ్యమున విచిత్ర దృశ్యమొకటి నాకంటబడుట తటస్థించెను. బక్కచిక్కిన దేహముతో, మలినమైన జీర్ణవస్త్రములు ధరించి, తుప్పవలెనున్న మాసిన కేశములతో, భిన్నమైనట్టి యొక మట్టిపాలిక చేతబట్టుకొని, ఒకయనాథ గోచరించినది. ఆమె ముఖమును చూచినప్పుడు, ఆమె బహు సంకటపడినట్లు చెప్పకయే చెప్పుచున్నది. ఆమె యొక ప్రాసాదముంగిట నిలువబడి, "అమ్మా! దిక్కులేనిదానిని. రెండురోజులనుంచి భోజనములేదు. పిడికెడు మెతుకులు పెట్టు తల్లీ;" యని పీలస్వరముతో అర్థించెనో లేదో తక్షణమే భవనాంతర్భాగమునుంచి "ఛీ! ముష్టిపీనుగా! ఈ కరువు రోజుల్లో మేమే బ్రతకలేక చస్తున్నాము. నీకేం? గుడ్డిదానివా, సొట్టదానివా? కూలో, నాలో చేసుకొని బ్రతకలేవూ? పాపిష్టి! ఎందుకే యింకా నిల్చున్నావు .. అని గర్జన ఉరుముచునే యున్నది. ఇక నేను ఆ మాటలు వినలేక నా దారిని నేననుసరించి ఇల్లు చేరుకున్నాను. ఏమేమో ఆలోచనలు నన్ను కలచివేయుచున్నవి. ఎందుకో నేను వీధిచావిడిలోనే నిల్చున్నాను. అల్లంత దూరములో ఈడువలేక ఈడువలేక తన దేహమును ఈడ్చుకొనుచు ఒక జీవచ్ఛవము పోవుచున్నది. కాదు...! కాదు.. !! మాయింటి వైపునకే వచ్చుచున్నది. దానిని పరిశీలించగా నదినాకు మార్గమధ్యమున కన్పించిన ముష్టిదే. మా గుమ్మముపద్ద కామెవచ్చి, నీరసమైన గొంతుతో, "తండ్రీ! పిడికెడు మెతుకులు పెట్టించు." అని పలికినది. ఆమె విషాదపల్కులు నా హృదయమును కలచివైచినది. నాలో జాలి, దుఃఖములు ఒక్కమారే పొంగి పొరలినవి. నేను వెంటనే ఇంటిలోనికిబోయి యెవ్వరితోనూ ప్రసంగించక ఇంతయన్నము తీసుకొనివచ్చి యామెకు పెట్టితిని. ఆమె సంతోషవదనయై, మిక్కిలి యాత్రముతో దానిని భుజించి కడుపునిండునట్లు నీరు త్రాగినది.

"తండ్రీ! నాప్రాణము కాపాడిన దాతవునీవు. ఇంక నేను వెళ్లివచ్చెదను." అని పల్కినది. వెంటనే నామనస్సులో అనేక యాలోచనలు బయలుదేరినవి. చివరికి ఉండలేక "అమ్మా! నీకు ఇంత పిన్నవయస్సులోనే ఈ యాచనావృత్తి జీవనాధారమగుటకు కారణమేమి? నీకు తల్లిదండ్రులుగాని, అన్నదమ్ములుగాని, అక్కచెల్లెండ్రుగాని యెవ్వరూలేరా?" అని ప్రశ్నించినాను. అప్పుడామె ఒక వేడి నిట్టూర్పువిడచి, "బాబూ! ఈ పాటి ప్రశ్న నన్ను ప్రపంచములో ఇప్పటికెవ్వరూ అడుగలేదు. నాకష్టసుఖములతో ఈ మానవజాతికి పనిలేదు. మీరు పోవుచున్న నాప్రాణమును కాపాడిన దాతలు. నాకథ చెప్పెదను, వినండి." అంటూ ఈ విధముగా చెప్పుట కారంభించినది.

"మేము యాదవకులమువారము. నాకు తల్లిదండ్రులు, ఒక అన్నయ్య ఉండేవారు. మాకు మూడు పాడిగేదెలు, ఒక చిన్నపూరియిల్లే ఆస్తిపాస్తులు. మా నాన్న ఆ గేదెలపాడివలననే ఏదో యొక విధముగా జీవనయాత్ర సాగించేవాడు. నాదురదృష్టవశాత్తు నేను జన్మించిన ఆరుసంవత్సరములకే మా నాన్న గతించినాడు. మా అమ్మ మమ్మల్ని చూసుకుంటూ, నాన్నపోయినాడన్న విచారమే క్రమంగా

మఱచిపోయింది. నేను, మాఅన్న అమ్మతో హాయిగా, ఆటపాటలతో కాలము గడిపేము. నాకు 12 సం॥ల వయస్సు, మా అన్నకు 15 సం॥ల వయస్సు. ఇట్లా యుండగా మాయూరిలో కలరాయనే భయంకర పిశాచము ప్రజల నందఱను ఆవహించినది. ఆ కలరా పిశాచము మా అమ్మనుకూడ సోకినది. అమ్మ మంచముపైనే మలమూత్రములు చేయుచున్నది. ఎడతెఱిపిలేని వమనములతో మాచిన్నగుడిసె అశుభ్రమై పోవుచున్నది. నేను, అన్నయ్య పిడికిలిలో ప్రాణములు బిగపెట్టుకొని యున్నాము. మా అన్నయ్య మిక్కిలి శ్రద్ధతో అమ్మయొక్క మలమూత్రములు, వమనములు, యెత్తి శుభ్రము చేసే వాడు." (దుఃఖ మాపలేక సజలనేత్రయైనది. నోటమాటరాలేదు.) నాలో విస్మయ విభ్రాంతులు కల్గినవి. "తరువాత యేమిజరిగినది? చెప్పమ్మా!" యని అడిగితిని.

"అమ్మ ఆఖరిమాటలు నాకు ఇప్పటికిని కొంచెము జ్ఞాపకమున్నాయి, "అబ్బాయీ! చెల్లిని జాగ్రత్తగా చూసుకో. మరి యిక నేను ..." అని శాశ్వతముగా కండ్లుమూసినది. వెంటనే మేము అమ్మ కట్టెపైపడి దుఃఖపారావారములో మునిగిపోయేము. ఇంకను నాకడుపులో దుఃఖము చల్లారనే లేదు. మరి నాలుగు రోజులకు ఆ భయంకర కలరా పిశాచము మా అన్నయ్యనుకూడ కౌగలించుకొన్నది, ఈ నిర్భాగ్యురాలిని ఒంటరిగా విడిచిపెట్టేసి, అట్టి విపత్కాలములో నాకు భగవంతుడుకూడ తోడ్పడ లేదు. మా అన్నయ్యయొక్క ఉచ్ఛ్వాస, నిశ్వాసలు అనంతవాయువుల్లో ఐక్యమై పోయినవి. కష్టాలలో కష్టాలు కల్పించుట ఆ భగవంతుని విలాసమేమో! ఇట్టివారినిచూచి ఆనందించుతాడు!! ఇంకను అంతటితో నన్ను వదలిపెట్టలేదు. ఆ రాత్రియే, మంచి సమయము లభించినదని తలచి యెవరో మాగేదె నొక దానిని దొంగిలించినారు. తెల్లవారుఝామునచూడగా యేమియాశ్చర్యము! - మరియొకగేదె కాళ్లుజాచి చచ్చియున్నది. నలుగురూవచ్చి దానిని నాగుపాము కఱచినదని చెప్పిరి. మరియొకగేదె వట్టిపోయినది. ఆహా! సర్వేశ్వరునికృప నాపై నిట్లున్నది. నేనీప్రపంచములో నింక జీవించుట యెవరికొఱకు? కాని ఈ కష్టాలన్నీ పడునట్లు నానుదుటిపై బ్రహ్మ వ్రాసినప్పుడెట్లు తప్పును? ఇంక నాజీవితము నడిసముద్రములో కొట్టుకొనుచున్న చుక్కానిలేని నావయైనది. అప్పటినుంచి ఈ యనాథ యిట్లు వాడ వాడలంబడి భిక్షమెత్తుకొనుచున్నది. బాబూ! ఈ నాలుగేండ్లనుంచి నాకథ సావధానముగా విన్నవారేలేరు. మీకు నా కృతజ్ఞతా వందనములు." అని తన మట్టిపాలిక చేతబట్టుకొని మెల్లగా నడచిపోవుచున్న యనాథను నిర్ఘాంతపు దృక్కులతో చూచుచు యట్లేనిలబడిపోయితిని.

# తలపు వలపులు

(ఒక మధురాతి మధుర ప్రభాతంలో ప్రియుని అన్వేషిస్తూన్న ప్రేయసి సముద్రపు టొడ్డున పతినిజూచి)

నాకనుల వెలుగా!
నా ప్రేమ జ్యోతీ!
నాజీవ నాధార!
నాహృదయ శక్తీ!
నాజ్ఞాన పుంజంబ!
నామనో దీప్తీ!
నావలపు తరగా!
నా ప్రేమ పురుషా!
ధర్మరాజ్యము వేగ
స్థాపించు వీరా!
రావోయి! రావోయి!
రాజీవ నేత్రా!
కనులలోపల కరుణగాంచి
మనసులో నీమూర్తి నుంచి
తనువునీకయి తొందరించ
వనికి వచ్చితివా!
మణులలోపల వెల్గువీవని
కనులవిందగు మూర్తివీవని
కుముద బంధునిమోము సొగసని
నన్ను పొగిడితివే!
వలపువెన్నెల యవ్వనంబవు
తలపుమేడల అందమీవే
వెలుగులతలకు పాదువే యని
తెలియజెప్పితివే!
ప్రణయ రాజ్యము సౌఖ్యదంబని
మనచరిత్రమె చెవుల విందని
మనసు మనసూ కలిపివేసీ
అభయ మిచ్చితివే

నీవులేనిదె నేనులేనని
నీవు నేనూ ఒక్కటేనని
జీవితమ్మునకు మూలమీవని
బోధజేసితివే!
తలపులెగసెడి అలలతోడ
వలపులుబెకెడి సంద్రమనగ
పలుకు పలుకున నిన్ను పొగడే
హృదయ మున్నదిగా!
వనముపై బడె నీదుప్రేమ
వనముప్రేమ లేదు నీపయి
వనము మించిననేను నీకయి
తిరుగుచుంటినిగా!
కమలబంధుని లేత వెల్గులో
కమలమా నీమోముగాంచీ
హృదయ కమలపు తేనెవాకలు
పొర్లిపోయినవీ!
విరహవేదన పొందజాలక
సరముగూరిచి వలపుపూలతో
ఉరముపైన అదుముకొనుచు
అరుసమందితినీ.
నేత్రమీవూ పాప నేనని
గాత్రమీవూ శృతిని నేనని
రాత్రివీవు నెలను నేనని
జోడు గూర్చితివే!
నిన్నువిడచి ఉండలేనని
తెన్నుజూపెడి దీప మీవని
మిన్నుముట్టుచు నన్ను గూరిచి
బాసజేసితివే!

వర్ష మేఘము సూర్యకిరణము
హర్షమందగ ఇంద్ర ధనువును
సృష్టిచేసెను గగనమందని
నాకు జూపితివే!
నీదు సౌఖ్యమె నాదు సౌఖ్యము
పాడుకోవలె ప్రేమతీవలు
వేదసార మదింతియేనని
వాదమాడితివే!
అన్నిమెన్నో ఆశలైతే
మిన్నగా జూపించి నాకు
పన్నుగడలెవో పన్నినీవు
నన్ను విడచితివా!

చెట్టుగుట్టా పుట్టలన్నీ
పట్టిపట్టీ వెదకుకొనుచు
ఎట్టకేలకు నిన్నుగానక
అలసిపోతినయా!
ప్రియుడు వదలిన తనువదేలని
భయము పుట్టగ జీవితముపయి
రయముమువచ్చీ కడలిలోన
కలియ నెంచితినీ.
కన్నులెత్తీ నన్నుజూచీ
పన్నులెత్తీ మాటలాడీ
నన్ను కౌగిట జేర్చుకోని
గృహము నడుపండీ!!!

"శాంతిశ్రీ"

---

ఒకస్త్రీ డాబుసరిగా 20 రూపాయలు బ్యాంకిలో డిపాజిటు చేయుటానికి వెళ్లి షరాబుయెదుట నిలబడింది. అతడు డిపాజిటుచేసే ఫారమును చేతికిచ్చి పేరు చిరునామా మొదలైన వివరములను వ్రాయమన్నాడు.

ఆమె "నాపూర్తి పేరు వ్రాయాలనా" అని అడిగింది.

"అవును" అన్నాడతడు.

"నాపెండ్లికి ముందున్న పేరా లేక యిప్పటిపేరా" అని మరలఅడిగింది.

అతడు "ప్రస్తుతపు పేరు వ్రాస్తేచాలు" నన్నాడు.

"నాపేరుతోబాటు నా భర్త పేరుకూడానా" అని అడిగింది.

'నీపేరుతోబాటు నీభర్త పేరుకూడా కలిపివ్రాయండి; లేదా మీభర్త పేరువ్రాసి చివర సతీమణిఅని కలపండి; లేదా మీరుసాధారణంగా వ్రాసేటట్లు వ్రాయండి' అన్నాడాషరాబు కొద్దిగా విసుకుగా.

"అయితే, నాకు వ్రాయడం చేతగాదు మరి ఎలా" అన్నది ఆస్త్రీ.

# ప్రాచ్యదేశపు స్త్రీలు

శ్రీ యస్. శకుంతలా బాబ్జి

పాశ్చాత్యదేశపు స్త్రీలకు అసూయకల్గించి, వాళ్లను రంజింపజేసే ఆకర్షణశక్తి ప్రాచ్యదేశపు స్త్రీలలో వుంది. వారికళ్లను స్ఫురింపజేసే ప్రాచ్యదేశపు స్త్రీ సౌందర్యం తెలుసుకుందాం.

గత యిరువది సంవత్సరములనుండి ఆసియా దేశపు స్త్రీలు, పాశ్చాత్యదేశపు స్త్రీల సౌందర్యాలంకారములను అనుసరిస్తున్నారు. అమెరికన్ ఫిల్ములు, హాలీవుడ్ సౌందర్యం - యిట్లాంటివన్ని ప్రాచ్యదేశపు స్త్రీల అనుకరణకు ఎంతో ప్రాధాన్యమిచ్చేయి.

ఉన్నతవిద్య నభ్యసించి, నవనాగరికులైన ప్రాచ్యదేశపు స్త్రీలయొక్క "డ్రస్సింగ్ టేబిల్" మొదలైనవి ప్రకటనలువలన ప్రఖ్యాతిగాంచిన విలాస వస్తువులతోను, తదితరములైన పరిమళ ద్రవ్యములతోనూ, అలంకరింపబడినచో, సామాన్య ప్రాచ్యదేశపు స్త్రీలు, మొదటనుండి వస్తూన్న సౌందర్యాన్నే ఆరాధిస్తున్నారు. అందులో ముఖ్యమైనవి తమలపాకులు. "హెనా" అలంకరణకు పనికివచ్చు ఒకవిధమైన ప్రాచ్యదేశపురంగు. మలయా స్త్రీలు అధరాలు ఎర్రగా కన్పించేటందుకు, తమలపాకులు నమిలెదరు. హిందూ, ముస్లిం స్త్రీలు అరిచేతులు, గోళ్లు, ఎర్రగా కన్పించేటందుకు, నారింజపండు రంగుగల హెనా నుపయోగిస్తారు. కొందరు "లిప్‌స్టిక్" "నెయిల్ పెయింట్"ను ఎక్కువగా పొగడుతూవుంటే, తమలపాకు, హెనాను అంతగా మెచ్చుకోవడం కష్టం.

ప్రాచ్యదేశపు స్త్రీలు, హిందువులు, ముస్లిములు, మలయాలు, చైనీయులు, సయామీస్ - వీరు సాధారణంగా కస్తూరి మొదలైన పరిమళముల నుపయోగిస్తారు. ధనవంతులైనచో ఫ్రాంసు, ఇంగ్లండు, అమెరికానుంచి, దిగుమతైన వాటినుపయోగిస్తారు. ధనికులైన, బీదలైనసరే యీ పరిమళ ద్రవ్యములను, ఒక విధంగా పుష్పములనుంచి తయారుచేయుటకు ప్రయత్నించెదరు. హైందవస్త్రీలు, చూచుటకు అందంగా, నల్లగా ప్రకాశించే తమజుట్టునందు మల్లెపువ్వులు ముడుచుకుంటారు. మలయాస్త్రీలు, మిక్కిలి సువాసనగల్గిన సంపంగి పూవులు, పసుపు ఆకుపచ్చరంగుగల్గిన "కెనంగా" పూవులు నుపయోగిస్తారు. ఈ "కెనంగా" పూవులనుంచే మలయనులు, కడురమ్యమైన "యంగ్ యంగ్" అనే పరిమళ ద్రవ్యము తయారుచేయుదురు.

ముఖ్యంగా గమనించవలసిన మరోవిషయం ఏంటంటే, మృదువుగా, నల్లగా ప్రకాశించుచున్న జుత్తు. ఒకప్పుడు నాదగ్గర ఒక చైనా నౌకరు పనిచేస్తూ యుండేది. ఆమె అందంగావుండే తన జుత్తును చూచుకొని ఎంతో గర్వించేది. అది నడుమువరకు వ్రేలాడుతూ వుండేది. తరచుతలకు స్నానంచేసి, ఎంతో జాగ్రత్తగా వుండేది ఆమెజుత్తు విషయమందు. ఒకనాడు నేను ఆమెతో "నీ జుత్తు అంతగా ప్రకాశించేటందుకు ఏమి వ్రాస్తున్నావని" అడిగాను. వెంటనే ఆమె ఒక పాత్రతీసుకొనివచ్చి అందులోగల కర్రచెక్క లాంటిదితీసి, కొంత నీరుకలిపి, ఆకలపగావచ్చిన జిగట పదార్థాన్ని, ఆమె జుత్తుకువ్రాసి, తాను అదే వ్రాస్తున్నట్టు చెప్పింది.

చైనా స్త్రీలుస్త్రీలుత్తమమగల బంగారమును, రత్నములు మొదలైన ఆభరణములను రెండు కారణములచే విలువయిస్తారు. ప్రకాశవంతమైన పసుపుచ్ఛాయగలరంగు, విలువైనరత్నములు - యీ రెండు వాళ్ల శరీరానికి, జుత్తుకు ఒక వన్నె తెస్తాయని, ఆభరణములు వారియొక్క హోదాను తెలుపుతాయి. ఈ కారణంచేతనే, వాళ్లకుగల ప్రతిచిన్నవస్తువు, పండుగ దినాల్లోను, శెలవు దినాల్లోను ధరిస్తారు.

వాళ్లలో ఉన్నతవిద్య నభ్యసించినవారు నవీన ఆభరణములు ధరించడంలో యిష్టత చూపుతారు. మెడదగ్గర తగిలించేటందుకు, వజ్రములుగల పిన్నుగాని, వేళ్లకు ఉంగరాలు, చెవులకు లోలకులు మొదలైన నగలవిషయమై, లండన్, న్యూయార్క్, పారిస్ నగరములలోగల "ఫేషన్" అనుకరిస్తారు.

ధనవంతులైన హిందూ, ముస్లిం స్త్రీలుకూడ యిదే విధంగా అనుకరిస్తున్నారు. మిక్కిలి విలువగల్గిన వజ్రాలతో తయారయ్యే ఆభరణములు (ముక్కుపుడకలు, లోలకులు మొదలైనవి పలువిధములైన రకములలో) యూరోపియన్, యిండియన్ ఫేషన్లలో ధరిస్తున్నారు. సామాన్య కర్షక స్త్రీలు ఇండియాలోగాని, పాకిస్థానులోగాని కొద్దిపాటి కడియాలు, వెండిమెట్టెలు, అందెలు మొదలైన వాటితో సంతృప్తి చెందుతారు. ఈ వస్తువుల తయారీ పూర్తిగ యిండియన్ రీతిలోనే వుంటాయి. ఇంకా బీదస్థితిలో వుంటే, ఆమె అతిచమత్కారముగ, ఫేషనుగావుండే స్ఫటిక రాళ్లనుకొని, మెరుస్తున్న గాజుముక్కలు, ఒక తీగెతో అంటించి, పైకి డాబుగ జిగజిగ మెరిసేటట్లు ధరిస్తుంది.

ప్రపంచమందుగల స్త్రీలందరివలె మలయ స్త్రీలుకూడ ఆభరణములు ధరించుటయందు ఎక్కువ ఆసక్తి చూపుతారు. బంగారం, వజ్రాలతో తయారైన అనేక రకములలో పిన్నులను జాకెట్లను తగిలించేటందు కుపయోగించెదరు. అందంగా వుండే "జెలసీన్" స్త్రీలుకూడ యిదేవిధం అవలంబిస్తారు. ఇండియన్, మలయన్ స్త్రీలుకూడ యిదేరీతి. నల్లటి ప్రకాశవంతములైన నేత్రాలు కల్గివుంటారు. ప్రస్తుతం పారిస్, అమెరికన్ కండ్లకు మేకప్ చేయుటయందు, ఆడలేడికివలెగాని, పిల్లికివలెగాని కలనల్లటి కళ్లలా వుండాలని చెప్పే సిద్ధాంతం, యుగయుగములనుంచి ఇండియన్ స్త్రీలల్లో కానవస్తున్న విషయమే. కళ్లకు కాటుక వ్రాయడంచేత యింకా ప్రకాశవంతంగా వుంటుంది. పెద్దవాళ్ల దగ్గరనుంచి, చిన్నపిల్లలలోకూడ యీ అలవాటు కన్పిస్తుంది.

మనం, అతివేగంగా మారిపోతున్న పలురకములైన ఫేషన్లను అనుకరిస్తున్నాం కాబట్టి, ప్రాచ్యదేశపు స్త్రీలకు తమ సాంప్రదాయమైన దుస్తులు ధరించడంలో విసుగు కల్గుతుందని అనుకుంటాం. అయినా ఆ విధంగా జరగలేదు. ఉదాహరణగ చెప్పాలంటే చైనా స్త్రీలు సన్నంగా మెడవరకు పట్టివుండే దుస్తులు ధరిస్తారు. దీనికి మలయాలోగల చైనీయులు "బియాంగ్ సామ్" అని, చైనాలో "చిపాజ్" అని అంటారు.

"బియాంగ్ సామ్" కొంచెం సూక్ష్మంలో "మంచూస్" ధరించే పెద్దగౌనును పోలివుంటుంది. రానురాను యూరోపియన్ల ఫేషన్లు రావడంవలన కాలరు వెడల్పు మొదలైన విషయాలలో కొద్దిమార్పులు కల్గేయి. యిరవై సంవత్సరాల నాటిదానికి, ఇప్పటిదానికి పోల్చిచూస్తే చాల భేదం అగపడుతుంది.

మలయా స్త్రీలు ధరించిన దుస్తులలోగూడ కొన్ని మార్పులు వచ్చేయి. మొదట్లో మలయా స్త్రీలు తొడిగే జాకెట్ ఒకేవైపు కత్తిరించబడి కొంచెం వదులుగా నుండేది. ఇప్పుడు వీటికికూడ యూరోపియన్ ఫేషను తగిలింది.

# ప్రాచ్య దేశపు స్త్రీలు



ఈ ఫేషన్ అనేది చీరలలోకూడా వుంది. చీర అంటే ఏదో ఒక ఐదుగజాలగుడ్డ అనుకోవడం కాదు. చీరమడతలు పలురకాలుగా వుంటాయి. అంచులో రోజు రోజుకు మారిపోతున్న ఫేషన్లు వున్నాయి. అంచు ఎంత బాగుంటే అంత అందం, ఖరీదు ఎక్కువ వుంటుంది ఆచీరకు. ఆంగ్ల స్త్రీ "ఒకసారివచ్చి నా క్రొత్త ఫ్రాకుచూడు" అని నీతో చెపుతుంది. అదేవిధంగా హిందూ స్త్రీ కూడా ఒకసారివచ్చి నా క్రొత్తచీరచూడు అనిచెపుతుంది. నువ్వు ఆమెతో కలసివెళ్లి, క్రొత్తచీర, దీనితో మిగిలిన చీరలు ఎంతో శుభ్రంగా మడతపెట్టి వుండడం చూస్తావు. ఆ మధ్యాహ్నం అంతా, ఆ చీరలు మడతలు పెట్టడం చూస్తూ కాలం గడపవచ్చు.

చీరలానే అందంగావున్నా, యింకా ప్రపంచం అంతటా తెలియని ముస్లిం స్త్రీలు ధరించిన దుస్తులు ఏలాంటివంటే, కాలి చీల మండదగ్గర కొంచెం పట్టివుండే షిల్కు షరాయి, పొడవైన చొక్కాయి, తరువాత తలమీదుగా ముసుగు.

ఈ పలువిధములైన ప్రాచ్య సౌందర్యము లన్నింటిని ప్రోగుచేసి ఏరినచో దూర ప్రాచ్యపడచుగా పరిగణింపబడేదెవరు ? నేను, ప్రకాశవంతములైన నేత్రములు, తెల్లటి దంతములు, యింకను మెరయుచున్న నల్లటి జుత్తుగల యిండియన్ స్త్రీని, అందాలు చిందేటి వంపులు అతిగిన శరీరముగల మలయా స్త్రీని మెచ్చుకుంటాను. చైనీయుల సౌందర్యాన్నికూడ మెచ్చుకోగలను. చంద్రబింబంలా గుండ్రంగావుండే ముఖంతో, అతిసున్నితంగావుండే చైనా స్త్రీలో ఒకలాంటి అపురూపమైన సౌందర్యంవుంది.

# నిర్వేదన



శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

(జూలై నెల సంచిక తరువాయి)

నెమలికన్నీరుగార్చిన నెనుకివచ్చు, వేటగానికి ముద్దేన వెతలనేను
తోడరి కన్నీరునించినఁ దొలఁగిచను నె, విధివిధానంబు నెరవేర్చి విడుచుఁగాని

ఎంతతపియించు కొంటివో యేరికెరుక, యెన్ని కన్నీళ్లుగారెనో గన్నదెవరు
జన్మమా : నీకు జాలి యీజగతిలేదు, కఱగునే వేడికన్నీట కఠినజగము

కఱగు నినుమైన నిసుమంత కాకదగుల, కఱగుశిలయైన చందురుకాంతిచేత
వేడికన్నీటగఱుగదు వేయిగతులఁ, గేలుమోడ్చిన జగతికి జాలిలేదు

గొప్పవారు గూడ తప్పించుకొనలేరు, గలుగనున్న నెల్ల గలిగితీఱుఁ
బార్వతీశు పాలఁబడెను నగ్నత్వంబు, చక్రికబ్బె భుజగశయన మరయ

అనుపమరూప భోగ విభవంబులు నిక్కములంచు వానినే
గనుగొని మానసంబునను గర్వమతిన్ విహరించుచుంటి నా
దినములు వెళ్ళిపోయె గురుతింపదు నాదగు మందబుద్ధియున్ ని
ల్చెనె సతతంబు పున్నమగ చీకటిరాత్రులు రాకయుండునే

అకట ఆశాశుకంబదే యంబరమున, కొక్కెపెట్టున నెగసి తానోపలేక
పృధివిబడె భగ్నపక్షమై ప్రేమలేని, బోయవిధి నాధునకు జాలిపుట్టదౌర

ఆశకుమేరగల్గ దుచితానుచితంబు లెఱుంగబోదు పె
ల్లాశకు లోనుగాక దనకందని దానికి చేయిజాపకన్
యీశుడొసంగినంత మదినెంతయు సంతసమందుటొప్పు పె
ల్లాశకుఁబోవరాదు; మదికయ్యది జాడ్యము ప్రాణహానియున్

జవజవలాడు నెన్నడుము జాణతనంబు నొయారిచేతలున్
తవతవనేగుఠీవియు మిటారితనంబు నెలారు నవ్వులున్
నవనవలాడు జవ్వన మనంగుని బాణముఁబోలు ప్రాయమున్
భువిని తిరంబుగా నిలువఁబోవుసుమీ; యవి స్వప్న తుల్యముల్

వెన్నెలరేలొకపరి పయినెన్నగ గాఢాంధకార నిబిడంబై కా
ర్కొన్నయు మాదివసంబులు కన్నారఁ జూతుమట్లె కష్టసుఖంబుల్

కోరెనె శర్వుఁడుఁ విసముగ్రోలగ పుర్రెల బిచ్చమెత్తఁగాఁ
గోరెనె విష్ణువాపులుగు గుఱ్ఱము నెక్కఁగ వార్ధిఁబండఁగాఁ
గోరుదురెల్లరుల్ శుభమె కోరరు కష్టచయంబులెవ్వరుఁ
గోరినయట్లు కోర్కులొడగూడునె దేవునకైన ధాత్రిలో

కుదురొకయింతలేక యెటకో బరువెత్తు మనంబదేటికో
హృదయముఁజీల్చు వేదనల యింపగ జేయునె శాస్త్రసంగతిఁ
సదయుల సాదుసజ్జనుల సంగతి నున్నను మానదింతయుఁ
వెదకెద నీయనంతపృథివిఁ నిను నీమహిమంబు లీశ్వరా

పరతత్వంబెరుగంగ నెంచి సతముఁ బ్రహ్మాండమా గ్రంధముల్
దిరుగఁ వైవగనేల యేటికనురక్తిఁ తత్వమస్యాది వా
క్సరణిఁ జింతనసేయ జన్మము వృధాసల్పంగనేలా: యికఁ
పరిశీలింతును సృష్టిమర్మము పరబ్రహ్మంబు గాన్పించెడిఁ.

——(०)——

# పశ్చాత్తాపం

శ్రీమతి
జె. ఉమాదేవి

వేణు చాలా స్థితి పరుడు. చదువుకున్న వాడు కూడాను. బుద్ధిమంతుడు. రూపసి. రామారావుగారు తన కుమార్తెకు వేణు అన్ని విధాలా తగిన వరుడని యెంచుకున్నాడు. ఇరువది వేల వరదక్షిణతో వేణూ జయల వివాహం జరిగింది.

వివాహానంతరం రెండు మాసాలకే వేణుకు విజయనగరంలో సర్కిల్ ఇనస్పెక్టరు పదవి లభించింది. కుటుంబంతో సహా వెళ్లి చార్జి వప్పగించుకున్నాడు.

జయ డాక్టరు పరీక్ష ప్యాసయింది. స్త్రీ స్వాతంత్ర్యమంటే భర్తను యెదిరించడమనుకునే వాళ్లలో ఆమె ప్రథమురాలు. తనుకూడా తన స్వార్జితంమీద ఆధారపడి వుండాలని, పాశ్చాత్య దేశపు స్త్రీలాగా తనుకూడా వుద్యోగం చేసి సంపాదించాలని ఆమె వూహ. ఆమెకు పాశ్చాత్య సభ్యతంటే చాలాయిష్టం. వాళ్ల వేషభాషలనుచూచి ఆనందిస్తూ వుండేది. చివరకు యెలా అయితేనేం తనుకూడా విజయనగరం జనరల్ హాస్పటలులో వుద్యోగం సంపాదించుకుంది.

భార్య భర్తా యిద్దరూ వుద్యోగం చేస్తే వండిపెట్టే దిక్కు కనిపించలేదు. హోటలు భోజనంచేసే యోగంపట్టింది. హోటలు నూనెకూరలూ, ఆ అశుభ్రపువంటా చూచి వేణు అసహ్యించుకునేవాడు. కాని పాపమేమి చేస్తాడు! ఏదియినా అంటే వండుకుతినమంటుంది. ఆ కాస్తమాట అనిపించుకోవట మెందుకని వేణు తనమర్యాద తాను దక్కించుకునేవాడు.

ఈవిధంగా రెండుమూడూ సంవత్సరాలు గడిచిపోయాయి. వేణూ జయలకు పుత్రుడు జన్మించాడు. వేణు హోటల్ భోజనం యికనైనా తప్పుతుందనుకున్నాడు. పిల్లలు లేనంతవరకు ఎలాతిరిగినా జయ పుత్రపోషణార్థమై తప్పకుండా వుద్యోగానికి రాజీనామా యిస్తుందనుకున్నాడు. ఆమెలోకూడా భారతీయ రణీమత్వం మెలకెత్తుతుందనుకున్నాడు. కాని అతని మనోభావాలన్నీ నీటిలోని మూటలైనాయి.

పిల్లవానికి అయిదవమాసం రాగానే జయతిరిగి ఉద్యోగంలో ప్రవేశించింది. పిల్లవాని పోషణ నిమిత్తమై ఒక తాయిని పెట్టింది.

ఆమే వంటకూడా చేసేది. పుత్రజననం వల్ల హోటల్ భోజనం మాత్రం తప్పింది.

ఒకరోజు జయవంట్లో సుస్తీగా నుండుటవల్ల సెలవుపెట్టి యింటిదగ్గరనే వుంది. సాయంకాలం తన యింటిచుట్టూవున్న తోటలో పూలమొక్కల మధ్యవున్న రాతిసోఫామీద బేబీని ఆడిస్తూ కూర్చున్నది. వృద్ధాప్యంలో తప్ప యెప్పుడు ధర్మం చేస్తావా అని సూర్యుడు తన పసిమి నంతా అయాచితంగానే స్థిరచరాలన్నిటికీ పంచివేస్తున్నాడు. వేణు ఈ ఉద్యానవన పుష్పాలు కూడా కొంతదానాన్ని గ్రహించాయి. సుందర స్త్రీ శరీరంమీద అలంకారాలు శోభించినట్లు వాటి సహజశోభ యినుమడించింది.

వేణు యింటికి వచ్చేసరికల్లా ప్రకృతి సౌందర్యాన్ని క్రోలుతూ కూర్చున్న మాతా శిశువులతని కంట పడ్డారు. కొడుకును ఆడిస్తూ వుండగా భార్యను చూడటం తనకు యిదే మొదటిసారి. ఇదిచూచేసరికి అతని హృదయం ఆనందంతో వుప్పొంగింది. కళ్లవెంట బొటబొటా అశ్రువులు జారినాయి.

వేణు బేబీని ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటూ 'జయా! మనకింతటి సౌభాగ్యం లేదుకదా!' అని దీనంగా అన్నాడు.

‘మనకేమి తక్కువని సిరీ సంపదా అన్నీ వున్నాయి. యింతేకాక మనయిల్లు స్వాతంత్ర్యనిలయం కూడాను. భారత దేశంలో యెవరయినా స్వాతంత్ర్యాన్ని దర్శించాలంటే నిజంగా మనింటికే చూడాలి’ అన్నది జయ.

వేణు నొచ్చుకొని అన్నాడు ‘అది కాదు జయా! ఇన్నిరోజులనుంచీ నీవేమన్నా యిప్పుడు పిల్లవాని కొరకైనా వుద్యోగానికి రాజీనామా యివ్వకపోతే పిల్లవాడు అన్యాయంగా పాడైపోతాడు. స్త్రీకి స్వాతంత్ర్యం కావాలి. ఆమె కూడా అన్నిటికీ అర్హురాలే. కాని ఆమె తన కర్తవ్యాన్ని మాత్రం మరిచిపోకూడదు. భర్త అసమర్థుడై కుటుంబాన్ని నిర్వహించ లేనప్పుడు స్త్రీ వుద్యోగం చేసి సంపాదించవచ్చు.

అప్పుడే ఆమెవిద్య ఆదర్శప్రాయ మవుతుంది. భర్త విపద్దశలో కూడా ఆమె విద్య వుపయోగపడుతుంది. అన్నివిధాలా సమర్థుడయిన భర్తవుండగా భార్య వుద్యోగం చేయటం హిందూస్త్రీ ధర్మానికి కేవలం విరుద్ధం. ఇది స్త్రీ స్వాతంత్ర్య మనిపించుకోదు. కేవలం ఊడిగం. ఇన్ని దినములనుంచీ భర్త ఊడిగం చేసి భార్యను స్వతంత్రురాలినిగా వుంచుతున్నాడు. ఎన్ని అవమానాలుపడి సహించైనా భార్యగౌరవాన్ని నిలబెట్టుతున్నాడు. స్వాతంత్ర్యానికి సరిఅయిన అర్థం తెలియక మీ స్వాతంత్ర్యాన్ని మీరే నీటగలుపుకుంటే దీనికి యెవరు బాధ్యులు.’

జయ:- “మీ వాక్చాతుర్యము చాలా ప్రశంసనీయమయినది. పిల్లవాని పేరుమీద ఒక్కసారి మీ అభిప్రాయాన్నంతా వెల్లడి చేశారు. ఊరికే మీ వుద్దేశ్యము వెలిపరచక పిల్లవాని పేరెందుకు? పిల్లవానియందు మీకెంత బాధ్యత వున్నదో నాకూ అంతే. హిందూ సంస్కృతి పేరిట మన పిల్లలను పిరికిపందలుగా తయారు చేస్తున్నారు. వాళ్లను చిన్నప్పటినుంచీ స్వావలంబనం అలవాటు చేయాలి. తల్లిదండ్రులు వాళ్ల వెనుక సహాయభూతులుగానుండి వాళ్లను ఎందుకూ పనికిరాకుండా చేయకూడదు. ఇతర దేశాలలోకంటే మనదేశంలో పిరికిపందలు యెక్కువగా తయారు కావటానికి యిదే కారణం.”

బొగ్గులు కాల్చేవాడికి మొక్కల సౌందర్యం యేమితెలుస్తుంది? పిల్లలని పెంచటమంటే యేదో ఒకవిధంగా పెద్దవాళ్లను చేయటం మాత్రమేనని తెలుసు ఆతాయికి. పిల్లలను ఆదర్శప్రాయంగా తయారు చేయటమంటే పాపమా మూర్ఖురాలికేం తెలుస్తుంది?

బేబీని వంటయింటికి యెదురుగావున్న హాలులో గిలక్కాయలిచ్చి కూర్చోపెట్టేది. ఆమెతన పని చేసుకుంటుండేది. బేబీ బొమ్మలన్నీ పాడుచేస్తూ కూర్చునేవాడు. అప్పుడప్పుడూ పారాడటానికి ప్రయత్నం చేస్తూ పడేవాడు కూడాను. కాని ఆమె మాత్రం తనపని కానిది ఇటు చూడనైనా చూచేదికాదు. కొంచెంసేపు యేడ్చి బ్రతిమాలేవాళ్లు యెవరూ లేకపోవటంచేత బేబీ తిరిగి తన ఆటలో లీనమైపోయేవాడు.

నెమ్మదిగా బేబీ పాకటం నేర్చుకొన్నాడు. పాకటం వచ్చింది మొదలు బేబీ చాలా అశుభ్రంగా కనిపించేవాడు. పాకటం రాకముందు నీళ్లు యెప్పుడుపోసినా శుభ్రంగానే వుండేవాడు. ఆమెకు జ్ఞాపకం వచ్చినప్పుడు నీళ్లుపోస్తే కాళ్లువచ్చినపిల్లాడు శుభ్రంగా యెట్లా వుంటాడు? ఈమట్టి అంతా శరీరంలో నిలవవుండడంచేత వళ్లంతా కురుపులు లేచాయి. ఏది యెలావున్నా తల్లివచ్చేవరకు మాత్రం చాలా శుభ్రంగా వుంచేది. ఆహారమివ్వటానికి నిద్రపుచ్చటానికి అసలు వేళా పాళా వుండేదికాదు. ఆమె యిష్టము వచ్చినప్పుడు యిన్నిపాలు పోసేది. ఒక్కొక్కసారి బేబీ యేడ్చి యేడ్చి సొమ్మసిల్లినట్లు నిద్రపోయేవాడు. అతనికి తల్లిదండ్రులు అగంతకుల్లాగా కనిపించేవారు.

బేబీ నడక నేర్చుకోవటానికి యిదే ప్రథమదినం. తాయి కునికిపాట్లు పడుతూ, చుట్టకాల్చుకుంటూ గుమ్మంలో కూర్చుంది. బేబీ దొడ్లో మామిడి చెట్టునీడన ఆడుకుంటూ ఆడుకుంటూ నడక నేర్చుకోవాలని ప్రయత్నించ మొదలుపెట్టేడు. రెండు మూడు పర్యాయాలు లేవబోయి పడటం సంభవించింది. నాల్గవ సారి ఆ వంగీ వంగని లేతకాళ్లను వశపరచుకుని లేచి నుంచున్నాడు. కాని వెంటనే వెల్లికింత పడ్డాడు. తలలో సైలుబండి గొట్టం గుచ్చుకోవటం తడవుగా బొట బొటా రక్తం కారటం మొదలుపెట్టింది. చుట్టనిషాలో లీనమైన తాయి అసలటు చూడనేలేదు. ఇదేసమయంలో వేణువచ్చాడు. రక్తాన్ని చూచి భయపడ్డాడు, దగ్గరకు వెళ్లిచూచేసరికి తల చిల్లిపడివుంది. అతని పితృ హృదయం ఒక్కసారిగా వుప్పొంగింది ఏమీతోచక బేబీని యెత్తుకుని జయదగ్గరకు పరిగెత్తాడు.

గేటులోకి వెళ్లేసరికి జయ యెదురుపడింది. బేబీని చూడటంతోనే యిదేమిటని వ్యాకులంగా అడిగింది, వేణు యేమీ చెప్పలేక పోయాడు. అతని కపోలాలుమీద అశ్రువులు సాంధ్యారుణకాంతులలో రక్తసిక్తములా అన్నట్లు ప్రకాశించాయి. ఇది చూచేసరికి జయకు సంగతంతా అర్థమై పోయింది, ఇహమాట్లాడటం మంచిదికాదనుకుంది. బేబీని యెత్తుకుని లోపలికి వెళ్లింది.

బేబీకి రెండవ సంవత్సరం ప్రవేశించింది. నడవటం బాగావచ్చింది. నెమ్మదిగా గడపలు దాటటం కూడావచ్చింది.

వేణుయిల్లు మెయినురోడ్డులోవుంది. అక్కడ కార్లు, బండ్లు, సైకిళ్లు, రిక్షాలు విరామం లేకుండా తిరుగుతూ వుంటాయి. ఆరోజున గవర్నరుకు స్వాగత మిస్తున్నారు. రోడ్డంతా కాయితపు పూల తోరణాలు గజి బిజిగా వ్రేలాడుతున్నాయి. సూర్యుడు ఈక్రొత్తరకపు పుష్పాలెక్కడనుంచి వచ్చాయా అని చకితుడై తన సహస్ర నయనాలతో తదేక ధ్యానంగా చూస్తున్నాడు. అక్కడక్కడా చలువ పందిళ్లు వేశారు. కార్లు రోజుకంటే చాలా హడావిడిగా తిరుగుతున్నాయి. రకరకాల హారను ధ్వనులు మిన్ను ముడుతున్నాయి.

బేబీకూడా యీ స్వాగతంలో పాల్గొని కొంత ఆనందం పొందాలని నెమ్మదిగా రోడ్డుమీదకు వచ్చాడు. ఆ కార్లూ, పూలూ చూచేసరికి అతని బాల హృదయం ఆనందంతో వుప్పొంగింది. ఆ రంగు రంగుల పూలను లాక్కురావాలని ఒక్కసారిగా ముందుకు పరుగెత్తాడు. ఇంతలో ఒక్కకారు బేబీ మీదనుంచీ వేగంగా వెళ్లిపోయింది. అదేగవర్నరుగారికారు. ఈదుర్ఘటన చుట్టూ నలుగురూ మూగేరు. వారిలో వేణుకూడా వున్నాడు. తనకొడుకు శవాన్నిచూచి నిశ్చేష్టుడై పోయాడు. ఈదుఃఖవార్త జయ చెవిన పడటానికి యెంతోసేపు పట్టలేదు. ఇదివినేసరికి ఆమెమీద పిడుగు పడ్డట్టయింది. కాలికి జోడుకూడాలేకుండా పడుతూ లేస్తూ పరుగెత్తుకు వచ్చింది. ఆభీభత్సాన్ని చూచేసరికి ఆమె పైప్రాణాలు పైనేపోయాయి. కదళీవృక్షంలాగా విరుచుకు పడిపోయింది.

---




## దైవానుగ్రహం

ఒక రాజు తన కుమార్తెకు వివాహం చేయదలచి స్వయంవరము చాటించాడు.

రాజకుమారి అందగత్తె. విద్యావతి. ఆమెను వివాహమాడదలచి వివిధ దేశాల రాజకుమారులు స్వయంవరానికి హాజరయినారు.

కాని రాజకుమారిని వివాహమాడటం అంత సులభమనిపించలేదు. రాజు తన కుమార్తె స్వయంవర సందర్భములో ఎత్తుగా నొక గంట కట్టించి క్రింద నొక గుంట త్రవ్వించాడు. గుంటలోనుండి ఎగిరి ఎవరు గంట కొడ్తారో వారికి తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు.

అనేకమంది రాజకుమారులు ప్రయత్నించారు. ఆ సందర్భంలో కొందరు కాళ్లు చేతులు విరుగగొట్టుకున్నారుకూడాను. వచ్చినవారిలో చాలమంది నిస్పృహతో తిరుగు మొగంపట్టారు. ఆ సమయంలో నొక రాజకుమారుడు ముందుకువచ్చి తాను గంట కొడ్తానని సాహసించాడు. గంట కొట్టాడు. కాని ఆ గుంటలోనే పడి చనిపోయాడు.

రాజకుమారి ఆ దృశ్యాన్ని చూచింది. తన్ను వివాహమాడదలచి తన ప్రాణములను కోల్పోయిన రాజకుమారుని శవమువైపుకు పరుగెత్తిపోయింది. అతని తలను తన తొడపై నుంచుకొని తల్లిదండ్రులతో "ఈరాజకుమారుడే నాభర్త. నన్ను అతడు ప్రేమించాడు. మీరు ఏర్పరచిన పరీక్షలో నెగ్గాడు. నేను అతనిని ప్రేమించాను కాని అతడు తన ప్రాణములను పోగొట్టుకొన్నాడు. మేమిద్దరం యీలోకంలో సుఖించకపోయినా పరలోకంలోనైనా సుఖిస్తాం. మమ్ములనిద్దరిని పడవలోనుంచి నదిలో వదిలివేయండి" అని కోరింది.

తల్లిదండ్రులు తమ కుమార్తెను ఓదార్చ ప్రయత్నించారు. కాని లాభంలేకపోయింది. ఎన్ని చెప్పినా వద్దని, వినలేదు రాజకుమారి.

ఒక పడవలో చనిపోయిన రాజకుమారుని శవమును, రాజకుమారితోబాటు సమస్త వస్తుసామగ్రి మొదలైనవియుంచి నదిలోవదలి వెక్కి వెక్కి ఏడ్చారు తల్లిదండ్రులు.

పడవ గాలివాటము ననుసరించి పోతున్నది. ఎండనక, వాననక ప్రయాణం సాగిపోతున్నది. రాజకుమారి అన్న ఆహారములను పూర్తిగా మరచింది. రాజకుమారుని తలను ఒళ్లో నుంచుకొని ఏదో పరధ్యానంగా కూర్చొని కాలంగడుపుతున్నది.

ఆమె ముఖంలోని భావాలను అర్థము చేసికోడం సులభం. తాను అమర సౌఖ్యాన్ని అనుభవించబోతున్నానుకదాయనేతృప్తి ఆమెలో తొణికిసలాడుతున్నది. ఆమెకీ ప్రపంచములో మరిదేనితోటి సంబంధము లేనట్లున్నది.

మధ్యాహ్న సమయం. పడవ మెల్లగావచ్చి ఒక ఇసుకమెరకతగిలి ఆగింది. ప్రక్కనే చెట్లనీడన చల్లగనున్నది. రాజకుమారి మెల్లగాదిగి ఒడ్డున చెట్లనీడన కూర్చున్నది. చల్లగా గాలి వీచుచున్నది. రెండు ఆడమగ పిచ్చుకలు తీవ్రముగా పోరాడుకొంటున్నవి. చివరకు మగపిచ్చుక దెబ్బలకు ఆడపిచ్చుక చనిపోయింది. వెంటనేపోయి ఆ పొదలోనున్న ఏవో చెట్టుఆకులను తీసికొనివచ్చి ఆడపిచ్చుక చెవులో రసంపిండింది. ఎప్పటియట్లు ఆడపిచ్చుక లేచి మగపిచ్చుకతోపాటు ఎగిరివెళ్లింది.

దాన్ని చూస్తున్న రాజకుమారి పొదలోకివెళ్లి ఆకులు తీసికొనివచ్చి రాజకుమారుని చెవులో రసం పిండింది. నిద్రనుండి లేచినట్లు లేచి కూర్చున్నాడు. ఇక వారిద్దరి ఆనందమునకు మేరలేదు. పడవలోనున్న తినుబండారములను యిద్దరు ఆరగించారు.

భగవంతుని దయానుగ్రహములకు తమ కృతజ్ఞతను తెలిపారు. ఇద్దరు పడవలో కూర్చొని అమితోత్సాహంతో యింటికి ప్రయాణం సాగించారు.

వారినిచూచి రాజదంపతులు మహానందంచెందారు. వైభవంగా వారిద్దరికి వివాహంచేశారు.

చివుకుల లక్ష్మీకాంతమ్మ

---



---

# కన్నీటి జాలు



భాస్కర్

దిన దిన మేడ్తురెవ్వరు — మ
దీయ తమోమయ జీవితమ్ము రో
దనముల కంకితమ్మో? భయ
దానల కీలల కాకరమ్మో? రే
గిన పొగ రేక లాకొని యొ
గిందము లోన విలీనముం బొన
ర్పనగునో? ఏమిటో? కనుల
బాష్పములూరవు; గుండె లెండెడిన్.
ఏడ్చెదను నాల్గు దిక్కులు నేడ్చునట్లు,
ప్రకృతి యెల్ల నాతోగూడి పట్టరాక
యేడ్చునట్లు, ద్రవించి స్రవించునట్లు
శిలలు సైత మేడ్తును - కాలసీమ దాటి.
ఊరడింపు లెల్ల నుత్కట మొనరించు
పేరు కొన్న హృదయ భార భరము;
ఏడ్చి యేడ్చి నేనె యేడ్పులో శయనింతు
ఏడ్పులోనె యూరడింపు గొందు.
పుట్టినప్పుడె నాగుండె పొలములోన
శోక బీజాలు నాటె నీ లోక విధము;
సానుకూల వాతావరణాన నేటి
కయ్యవి మొలకెత్తి చిగిర్చి యందగించె.
కన్నుకొట్టి హసించు నక్షత్ర రాజి!
దూరమున జూచి కెరటాలు హోరుపెట్టు!
గుసగుసలు పోవు బండలా గుట్టలెల్ల
మానము భజించు - అపహాసమే నిజమ్ము!
రాగ పీయూష ధారా సుయోగ మంది
మెత్తనైనది మామక చిత్త విధము;
అదియు లోపమా? ఏడ్పింతురయ్యొ! నన్ను
లోకమెంత కర్కశవృత్త భీకరమ్మొ?

—(o)—

# నేటిపాపలే రేపటిపౌరులు

శ్రీమతి. బి. సుందరీబాయిగారు

మొన్న మాస్నేహితురాలింటికి వెళ్లినప్పుడు, వాళ్ల బ్బాయి, పదిహేనేళ్ల వాడు, బీరువాతాళాలు మారుతాళం చెవులతో తీసి, పాతికరూపాయలు దొంగిలించాడని చెప్పి, ఎంతో విచారించింది. పైగా, 'అదేమిట్రా?' అని అడిగితే, నోటికి రానితిట్లు తిట్టాడట కూడాను - ఇదేకాదు, ఇలాఎన్నో దుడుకుపనులు చేస్తున్నాడట. వాటివల్లవచ్చే జట్టీలను తీర్చలేక ఆ తల్లిదండ్రులు ఎంతో ఇవుదతున్నారు. పదిహేనేళ్ల వయస్సునకే ఇంత తుంటరి అయినప్పుడు, ఇక ఆపిల్లవాని భవిష్యజ్జీవితాన్నిగురించి ఏమనుకోవాలి?

ఈ విషయంలో ఆపిల్లవానితప్పులేదు. మొదటినుండి వానికి ఆజీవితమే అలవాట యింది. దాన్ని ఆ తల్లిదండ్రులు సహించి ఊరుకుంటున్నారు. అందుకు నిదర్శనంగా రెండు విషయాలు ఉన్నాయి. మొదటిది - నాలుగు, మూడేళ్లవయస్సులో వచ్చీరాని ముద్దు మాటలతో ఆపిల్లవాడు తనతల్లిని తిడుతూంటే, వానిప్రజ్ఞకు ఆమె ఎంతో ఆనందించేది. అంతేకాక, నాబోటి స్నేహితురాళ్లు ఎవరైనా యింటికివస్తే, గొప్పకోసం పిల్లవానిని "ఏదిరా అబ్బాయి తిట్టు, అదివింటుంది!" అని అడిగి తిట్టించుకొనేది. ఆ ముద్దుమాటలకు అందరూ నవ్వేవారు. నేను మాత్రం ఆనాడే చెప్పేను, అది ఆనందించి, ప్రోత్సహించవల సిన విషయంకాదని. అందుకామె అది అజ్ఞానమని, జ్ఞానంవస్తే దానంతటదే బుద్ధిమారు తుందని కొడుకును సమర్థించింది.

రెండవది - పైవిషయం జరిగిన రెండేళ్లు అనంతరానిది. బడికివెళ్లడం అలవాట యింది ఆపిల్లవానికి. దానితో చిరుతిళ్లుకూడా అలవాటయింది. అడపా తడపా తల్లిదండ్రులు డబ్బులుయిచ్చేవారు. అవి చాలనప్పుడు ఏఅలమారులోనో దాచిన చిల్లరలో తనకు కావలసి నవి తీసుకొనేవాడు. సామాన్యంగా తల్లి యీ విషయమై అంతగా పట్టించుకొనేదికాదు. ఇక తండ్రివిషయంలో, ఎప్పుడూ తన ఆఫీసుగొడవలే - ఇలాంటివి ఏవీ ఆయన చెవికెక్కేవి కావు. క్రమంగా పిల్లవానిచోరగుణం, వయస్సుతోపాటు మారి, కానులనుండి రూపా యల్లోకిదిగింది. అప్పటికి, తల్లి మందలించడానికి ప్రయత్నించింది. కాని, ప్రథమసంతానం అవడంవల్ల అంతకఠినంగా దండించలేకపోయింది. అథవా, ఎప్పుడైనా ప్రయత్నించ బోతే, నవ్వుతోనో, అలకతోనో, ఆ గండాన్ని గడుపుకొనేవాడు. కాని, పైనవివరించిన దుర్గుణద్వయం మాత్రం వానిలో వృద్ధిపొందుతూనే ఉన్నాయి.

ఈనాడు వానిని గురించి విచారించి ప్రయోజనంలేదని చెప్పేనునేను. చిన్ననాడే సరిదిద్దవలసిన వాని ప్రవర్తనగురించి ఉపేక్ష వహించినందుకు ఆ ఫలితాన్ని అనుభవించ వలసినదే.

ఇలాంటి ప్రమాదాలు ఆ కుటుంబంలోనే కాదు. అనేక సంసారాలలో, అనేక రూపాల్లో కనిపిస్తున్నాయి. నిజంగా, వీటికన్నింటికీ కారకులు పిల్లలుకాదు, వారినలా ప్రవర్తించనిచ్చిన వారి తల్లిదండ్రులు.

'మొక్కై వంగనిది మానై వంగునా?' అన్న పెద్దలమాటను అందరూ ఎరుగుదురు. అందులో ఎంతో సత్యముంది. పిల్లలజీవితాల్ని సరియైనమార్గంలో పెట్టడానికి తగిన వయస్సులో ఉపేక్షచేసినప్పుడు, తరుణం మించిపోయినతర్వాత, ప్రయత్నించడంకాని, విచారించడంకాని, దండించడంకాని నిష్ప్రయోజనమే అవుతుంది.

స్థూలదృష్టికి బాల్యదశ నాలుగుభాగాలుగా గోచరిస్తుంది. అందులో మొదటిది కేవలం అజ్ఞానదశ. దాన్ని మూడు సంవత్సరాలవరకు అనుకోవచ్చును. ఈ దశలో, పిల్లలకు పెద్దవాళ్ల కష్టసుఖాలతో ఎంతమాత్రం నిమిత్తంలేదు. వాళ్ల ప్రవర్తనను మాత్రం మూగిగా పరిశీలిస్తుంటారు - అంతే.

రెండవదశ మూడు సంవత్సరాలనుండి ఆరుసంవత్సరాలవరకు. ఈ దశలో పిల్లలు పెద్దవాళ్లను అనుకరించడానికి ప్రయత్నిస్తారు. మాటలువచ్చేవయస్సు. చిన్న చిన్న చిలిపిపనులుచేసే సమయంకూడాను. ఆ వయస్సులోనే, ఏదితప్పో, ఏదిఒప్పో, మాటలలోని, చేష్టలలోని మంచిచెడ్డలను తెలపడానికి ప్రయత్నించాలి. దానికి ఎంతో ఓర్పు, నేర్పు అవసరం. అవసరాన్నిబట్టి, దయ, కాఠిన్యాలను ప్రదర్శించాలి. కేవలం దయ అయితే, గారాబం అబ్బుతుంది. కాఠిన్యమేఅయితే ఏహ్యాభావం ఏర్పడుతుంది. మంచి మాటలను, ఆటలను ప్రోత్సహిస్తూ చెడ్డవాటిని నిరుత్సాహపరచాలి. తర్వాత ధైర్యం, అధైర్యంకూడా తెలిసేవయస్సు ఇదే. చీమనుచూసి కెవ్వుమన నివ్వకూడదు. దీపాన్ని ముట్టుకోనివ్వకూడదు. పిల్లలకు తిక్కవచ్చినప్పుడు బూచివాడికిచ్చేస్తానని భయపెట్టడం, వారిని కేవలం పిరికివాళ్లనుగా చెయ్యడమే అవుతుంది. ఆపనేతరచుచేస్తే ఆ భయంపోయి, వయస్సువచ్చినవెనుక, హరిబ్రహ్మాదులకైనా భయపడని మొండివారుగా తయారయి, సంఘానికి కంటకప్రాయులౌతారు.

అసలు పిల్లలకు 'తిక్క' వచ్చేదశ యిదేకూడాను. వాళ్లు అడిగిన వస్తువ లాతల్లిదండ్రులు యిస్తూండటంవల్ల, గారాబం, దాంతో ధైర్యం, అటుపైన మొండి

తనం అబ్బుతాయి. మనకు అందుబాటులోఉన్న వస్తువైతే కాలం అనుకూలమైతే తెచ్చి యివ్వగలం కాని, అందనివస్తువు, అకాలం అయితే ఎలాగు? అదియిస్తేనేగాని పోరుమానకపోతే మనగతి? అందుచేతనే, పిల్లలు కావాలన్న ప్రతివస్తువు యివ్వడం కాని, యివ్వడానికి ప్రయత్నించడంకాని చేయరాదు. దానికిపట్టు, విసుపు వుండాలి, ఆనాడే, తాముకోరదగిన, కోరదగని వస్తువులకు భేదం తెలుస్తుంది పిల్లలకు. ఇదేదశలో, ఆతిక్కతనం పోనప్పుడు ప్రాణం విసిగి, పెద్దవాళ్లు కొట్టడం ప్రారంభిస్తారు. మరికొంత మంది అయినదానికి, కానిదానికీ కూడా కొడతారు. పిల్లలను కొట్టడమంత అవివేకం మరొకటిలేదు. మొదటిసారి ఆదెబ్బలు కొంచెం బాధపెట్టినా, కాలక్రమంగా శరీరం బండబారిపోయి, దెబ్బలకు భయపడని మొండిగా తయారవుతారు. కాబట్టే కేవలం చూపులు, మాటలవల్లనే భయపడేటట్లు చేయాలి.

ఈవయస్సులోనే మరొక దుర్గుణం అబ్బే అవకాశముంది. అదే లంచగొండి తనం. బడికివెళ్లినప్పుడు కాని, చెప్పినపని చేయునప్పుడుకాని, కానియో, అర్ధణాయో లంచమిస్తారు. పిల్లలను చిరుతిళ్లు కొనుక్కోనివ్వడం వారి ఆరోగ్యాన్ని పాడుచేయడమే అవుతుంది. ఎంత ధనవంతులైనా, పిల్లలకు కావలసిన అల్పాహారాలు యింట్లోనే తయారు చేసి నియమ ప్రకారం పెట్టడం చాలా అవసరం.

మూడవదశ ఆరు మొదలు తొమ్మిది సంవత్సరాల వరకు. ఈదశలో పిల్లలు తమ ప్రజ్ఞను చూపడానికి ప్రయత్నిస్తారు. స్వంత కల్పితాలైన ఊహాలను ప్రదర్శించ బోతారు. వాటిలో మంచి వాటిని ప్రోత్సహించి, చెడ్డవాటిని అరికట్టాలి. ఆబాధ్యత తల్లి దండ్రులదే. ఇరుగు పొరుగుల స్నేహం విషయంలో కూడా జాగ్రత్త వహించాలి.

పిల్లవాడు చేసినతప్పును అబద్ధమాడి తప్పించుకోవడం ఈవయస్సులో నేర్చుకుంటాడు. ఆదుర్గుణాలు అబ్బకుండా జాగ్రత్త వహించాలి. అవసరమైతే దండించవచ్చును. చిన్న చిన్న జంతువులను, కీటకాలను, వేడుకకోసం హింసించకుండా చూడాలి. సత్యా హింసలలోని ఉత్కృష్టతను పిల్లలకు భోధించడం ఈవయస్సులోనే ప్రారంభించాలి.

తర్వాతది నాల్గవదశ. తొమ్మిది మొదలు పన్నెండు సంవత్సరాల వరకు. ఈదశలోనే కాఫీ, సిగరెట్టు మొదలైన దుర్వ్యసనాలు అబ్బుతాయి. ఇవి దుర్వ్యసనాలా అంటే శరీరారోగ్యానికిగాని, బలానికిగాని అవసరపడని పైరెండు ముమ్మాటికీ దుర్వ్యసనాలే. వాటికి పిల్లలను దూరంగా ఉంచడం చాలా శ్రేయస్కరం. అందువల్ల కలిగే లాభాలు కాలం గడచిన కొలదీ వారికే తెలుస్తుంది.

ఈవయస్సులోనే పిల్లలకు వారి వారి మనస్తత్వాలను బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క విద్యమీద అభిరుచి ఏర్పడుతుంది. తగినంత ఆర్థికబలం కలవారయితే, తమ పిల్లల అభిరుచికి తగిన విద్యనేర్పించిననాడు వారు ఆవిద్యలో అఖండ ప్రజ్ఞావంతులవడానికి ఎంతేనా అవకాశముంది.

ఈ నాడు మనకళ్ల ఎదుట తిరుగుతున్న నిష్ప్రయోజకులు, దుర్మార్గులు, వ్యర్థజీవులు వారి తల్లిదండ్రుల అశ్రద్ధవల్లనే అలాతయారయారని చెప్పాలి. 'ప్రాకృతకర్మ' అన్నది రెండోవిషయం. చిన్నప్పుడే తగినశ్రద్ధ తీసుకొని ఉంటే, వారు అలా తయారయేవారు కారేమో!

మనమేలా ఉన్నా, మన సంతానాన్నైనా సన్మార్గవర్తనులుగా చేయడానికి దీక్ష వహించాలి. ఆనాడే మనం సుఖించగలుగుతాం. మన సంఘం పురోగమించగలుగుతుంది. మన దేశం సుభిక్షంగా నుంటుంది.

'నేటిపాపలే రేపటి పౌరుల'ని ప్రతి జననీజనకులు గుర్తించాలి. పౌరుల ప్రవర్తన సక్రమంగా ఉన్ననాడే పరిపాలన సక్రమంగా సాగుతుంది. అప్పుడే సర్వజనులు సుఖిస్తారు.






# ఉర్లగడ్డలతో వివిధరకములు

## ఉర్లగడ్డవడలు.

10 పలముల వుర్లగడ్డలు వుడకబెట్టి పొట్టు తీయవలయును. 1 ఔన్సు శనగపప్పు నానవేసి కొంచము రుబ్బిన తరువాత అందులో ఆ వుర్లగడ్డలువేసి రుబ్బవలయును. వాటికితగిన పచ్చిమిరపకాయలు తరిగిపోసి వడలుతట్టి నేతిలో వేయించవలయును. కొద్దిగా పచ్చిపిండికూడ కలపవలయును.

## కలకత్తా ఉర్లగడ్డ పుళి.

10 పలాలు వుర్లగడ్డలు వుడకబెట్టి పొట్టు వొలుచుకోవలయును. 2 ఔన్సుల పెరుగులో పచ్చిమిరపకాయలు, వుప్పు, ధనియాలు, గసగసాలు, టెంకాయ నూరి కలిపి పొయ్యిమీద పెట్టి అందులో వుర్లగడ్డలు వేయవలయును. పొంగలాడినవెనుక దించి శనగపప్పు, కొత్తిమిల్లి గరిమసాలా వేయవలయును.

## ఉర్లగడ్డ శియ్యాళి.

½ వీశె వుర్లగడ్డలు వుడుకబెట్టి పొట్టుతీసి, ½ ఔన్సు శనగపప్పు నానవేసి రుబ్బి పచ్చిమిరపకాయలు, వుప్పు నూరి కలిపి కుడుము తయారుచేయవలయును. కుడుమును బద్దలుగాకోసి, ఒక కళాయి పాత్రలో తాలింపుపెట్టి అందులో వుర్లగడ్డలు, కుడుము బద్దలువేసి వేయించి దించిన తరువాత నిమ్మకాయ రసంపిండి సాంబారుపొడి వేయవలయును.

## ఉర్లగడ్డ మణుగుపూలు.

10 పలాలు వుర్లగడ్డలు, 1 ఔన్సు శనగపిండి, 1 ఔన్సు పచ్చిపిండి తీసుకోవలయును. వుర్లగడ్డలు వుడకబెట్టి పొట్టుతీసి బాగా రుబ్బుకొని అందులో పచ్చిపిండి, శనగపిండి, నెయ్యిపోసి బాగా కలుపుకొని, మణుగుబూలపీటతో పిండినివత్తి నేతిలో వేయించవలయును.

మిట్టా చంపకవల్లి

## టమాటాపండ్లహల్వా.

బాగుగా పండిన టమాటాపండ్లు 1 పౌను, పంచదార ½ పౌను. టమాటాలు శుభ్రముగాకడిగి కొద్దిగా నీళ్లుపోసి ఉడికించవలెను. కొద్దిగా ఉడికిన తరువాత దింపి చల్లార్చి, పైతొక్కు తీసివేయవలెను. గిజారులోనున్న గింజలు తీసివేసి, ఆ గిజారును మెత్తగా అగువరకు పంచదారపోసి కలుపవలెను. తరువాత గిన్నెలోపోసి పొయ్యిమీద పెట్టవలెను. బాగుగా ముద్దవలె అగువరకు కలుపుతూ నుండవలెను. తరువాత ఏలకపొడివేసి దింపి చల్లార్చవలెను. చల్లారినపిదప ఒక సీసాలో పోసియుంచిన కొద్దిరోజులు నిల్వయుండును.

కామాడ అమ్మాజీదేవి

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనిర్యై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్
# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కొ., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.



# 'రాజ్యం ప్రతిభ'



శ్రీమతి దే. జయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఆ నాడే విచారణ దినము. శకుంతల హత్యవిషయమై యేమిజరుగునోయని ప్రజలందరూ తండోపతండములుగావచ్చి న్యాయస్థానము నాక్రమించిరి. న్యాయసభయంతయు జనసముదాయముతో క్రిక్కిరిసి యుండెను. అందరూ నెప్పుడెప్పుడు పదునొకండు గంటలగునాయని ఎదురుచూచుచుండిరి. ఇంతలో 11 గం॥లయ్యెను. అందరూ నతికుతూహలముతో డిటెక్టివ్ ఆఫీసర్ గారి రాకకొరకెదురుచూచుచుండిరి. ఇంతలో వుచితరీతి ముస్తాబయి ప్రకాశరావు న్యాయస్థానమున కొచ్చెను. న్యాయాధిపతి, యితర న్యాయవాదులందరూ కూర్చుండిరి. నారాయణరావు, రుక్మిణమ్మ మొదలగు సాక్షులందరూకూడావచ్చిరి. అంత విచారణ ప్రారంభము చేయుకాలమయ్యెను.

న్యాయాధిపతప్పుడు నలుగురు రక్షక భటులను సీతయ్యా, రాజారావులను తోడ్కొని రమ్మనమని యానతిచ్చెను. రక్షకభటులు వారిరువురనూ సభలో ప్రవేశపెట్టిరి. అప్పుడు న్యాయాధిపతి యీ క్రింది రీతిలో ప్రకాష్‌ను ప్రశ్నింపదొడగెను.

న్యాయాధిపతి:-ప్రకాశరావుగారూ! ఈ యిద్దరిలో అపరాధి ఎవ్వరు? నిరపరాధి ఎవ్వరు?

ప్రకాశరావు:-రాజారావే యపరాధి సీతయ్యే నిరపరాధి.

న్యాయాధిపతి:-సరే! ఈతడే హంతకుడనుటకేమి ఆధారములుకలవు?

ప్రకాష్:-అంతయూ తర్వాత చెప్పెదను. సీతయ్య నిర్దోషి. ముందాతనిని విడిపింపుడు.

న్యాయాధి:-ప్రకాష్‌గారూ! విడిపించుట కెంతసేపు పట్టును? ఈతడు హంతకుడనుట కనేక నిదర్శనములుకలవు. కరవస్త్రమాతని యజమానురాలిదే. బాకుమీదితని పేరుకలదు.

ప్రకాష్:-న్యాయాధిపా! కరవస్త్రము శకుంతలదే. రాజారావు దానిని తీసికొని, సీతయ్యబాకును కాజేసి యీపనిజేసి నేరము సీతయ్యమీద నారోపించెను. నేనును మొదట యీ విధముగా అనగా మీ అభిప్రాయముగా పొరబడితిని.

న్యాయాధి:-సరే! హత్యకుగల ముఖ్యోద్దేశమేమి? ధనమా?

ప్రకాష్:-కాదు. ధనమేమాత్రమూ కాదు. అయ్యా! వినుడు. "ఈతడు శకుంతలను ప్రేమించి పెండ్లాడదలచెను: శకుంతలయు నీతని నదేవిధముగా ప్రేమించినది. కాని క్రమముగా నీతడు జూదరి, త్రాగుబోతు, వ్యభిచారియని తెలిసుకొని నీతని ప్రేమను నిరాకరించెను. క్రమముగా నీతనిని దూషింపదొడగెను. కాని యీతడామెను మాత్రము ప్రేమించుట మానలేదు. బలవంతముగనైనను తానామెను వివాహమాడదలచెను. సామ, దాన, భేద, దండోపాయములచే యీ కార్యము నెరవేర్చుకొనజూచెను. కాని దానికామె లొంగలేదు. అందుచే నీతడీకృత్య మొనర్చినాడు. నేను ప్రబల సాక్ష్యముచే రుజువు

చేయుదును. ఏం రాజారావూ! నేను వచించిన దంతయూ సత్యమేగదా?" అనెను. అంత రాజారావొక విషపు నవ్వుతో "అయ్యా! మీరీ కల్పితకథ నెట్లల్లితిరి?" అనెను. ప్రకాశ్ అతికోపముతో "ఛీ! స్త్రీ హత్యాపాతకా! ఇంకా వేషాలు వేస్తున్నావా? ఒప్పుకొనెదవా? లేదా?" అనెను. రాజారావు "సాక్ష్యమేది? ప్రబల సాక్ష్యమున్న యెడల నేను చేసినను, చేయకపోయినను యొప్పుకొందును."

ప్రకాశరావు:-శకుంతలే జెప్పినది ఆ నాటి సంగతంతయు.

రాజారావు:-"ఏమీ దయ్యమై యొచ్చినదా? లేక కల్లో చెప్పిందా" అని నవ్వెను.

ప్రకాశరావు:-దయ్యమైగాదు. డైరీరూపములో వచ్చినది, అని వెంటనే "న్యాయాధిపతితో మీరీ దినచర్య పుస్తకము చూడుడు. ఆ నాడు జరిగిన యావద్విషయములను శకుంతల యొక యక్షరమయినను పొల్లుపోకుండా నిందుపొందుపరచినదని" యా పుస్తకమును న్యాయాధిపతి చేతికిచ్చెను. ఆయనయు దాని నత్యాదరముతో నందుకొనిరి. రాజారావత్యంత ఆశ్చర్య భయములతో యావంక జూచుచుండెను. అందరూ ఆ వంకనే ఆశ్చర్యముతో చూచుచుండిరి. అప్పుడా సమయమున న్యాయాధిపతి యందరికీ వినబడునట్లా దినచర్య పుస్తకము నిట్లు చదవసాగెను.

"నేను నేడును మామూలుగనే యుదయమున లేచి కాలకృత్యములు తీర్చుకొంటిని. పదిగంటలగునప్పటికి మా నాన్నగారు, అత్తయ్య, బావ యందరును హాలులో కూర్చుండి యుండిరి. నేనుగూడ నచ్చటికి వచ్చి యొక సోఫాపై కూర్చుంటిని. మా నాన్నగారు నాతో 'అమ్మా శకూ! మీ రుక్కమ్మత్తయ్య నిన్ను తన కోడలిగా జేసికొనవలెనని కోరుచున్నది. ఏమంటావ్?' అనిరి. నేనునూ నవ్వుచూ "నాన్నగారూ! ఇప్పుడు మాత్రము కోడలిని గాదూ?" అంటిని. నాన్నగారు "అదికాదమ్మా! నీవు విద్యావతివి. రాజా నీ కన్ని విధముల తగినవాడు. నేను, అత్తయ్య పెద్దవాండ్లమైతిమిగదా! త్వరగా మీ పెండ్లి జూడవలయునని మా కోర్కె. మీ యిద్దరి అభిప్రాయముల ప్రకారమే మేము జేయుదుము. పోనీ రాజా నీవు చెప్పుముందు, శకుంతలను పెళ్ళాడుట నీ కిష్టమేగదా" అనిరి. రాజారావు "మామయ్యా! నేను శకూను తప్ప యింకెవరిని పెళ్ళాడుతాను?" అనెను. మా నాన్నగారు 'అమ్మా! బావ నిన్ను తప్ప యింకెవరినీ చేసికోడట. చెప్పుమరి నీ అభిప్రాయం?' అనిరి. నేను 'నాన్నగారూ! మరి మీ యిష్టమేమిటి?' నాన్నగారు "అమ్మా! నీ యిష్టమే నా యిష్టము. నీ కనిష్టమైన కార్యము లేవియు, నేనెన్నడును చేయను." అనిరి. అంత నేను "నాన్నగారూ! నేను దుష్టులను, జూదరులను, వ్యభిచారులను పెండ్లాడదలచలేదు. వారిని వివాహమాడినచో జీవితమంతయు దుఃఖపూరితము - దానికన్న బ్రహ్మచారిణిగా నుండుటయే యుత్తమము. నేను యితనిని పూర్వము వివాహమాడదలచితిని. కాని యాతని ప్రవర్తన యిప్పుడిప్పుడే నాకు తెలియుచున్నది. మీరేమో ఈతడు చాల సుగుణవంతుడని తలచుచున్నారు. మున్ముందు నీతడింకా దురాత్ముడగును. నేనిట్లనుట మీకందరకూ కష్టమేమో? నా మనస్సులోనున్న యుద్దేశము మీకందరకీ తెలియవలెననియే యీ విధముగా పల్కితిని. ఆ పిమ్మట మీ యిష్టము" అంటిని. అదివిని మా అత్తయ్య, నాన్నగారు నిశ్చేష్టులైరి. రాజారావు మాత్రమతి కోపముతో "శకుంతలా! నన్ను వివాహమాడ నీకిష్టము లేనిచో 'లేదు' యని మాత్రమే చెప్పుము. కాని యీ అనవసర అధిక ప్రసంగమంతా దేనికి? ఎవరో దుష్టులు నీకు నామీద లేనిపోని నేరములన్నియు చెప్పారు. కానిమ్మ"ని యాతడు చివాలున లేచిపోయెను. నేనును లేచి నా గది కెళ్ళితిని. ఉదయము జరిగిన విషయములివియే.

సాయంకాలము ఐదుగంటలకు రాజారావు నేను మేడమీదయుండగావచ్చి 'శకుంతలా! ప్రొద్దున నిన్ను కోపముతో చాల చాల, మాటలన్నాను. నన్ను వివాహమాడ నీకిష్టమేనా' అన్నాడు. వెంటనే నేను "లేదు ముమ్మాటికీలేదు. నీ ప్రవర్తన మారినచో నిన్నుతప్ప యింకెవరినీ వివాహమాడను" అంటిని. అతడమిత కోపముతో "నీమీద నాకెంత ప్రేమకలదో తెలుసుకో. నీయీమాటలవలన నెంత కోపమొచ్చి నదో చూడు. నిన్ను చంపియైనను నీమీద నాకుగల కోపము తీర్చుకొందును. ఏమనదేవు?" అన్నాడు. "ఏమనుట కేమున్నదండీ బావగారూ! రేపీమాటలన్నియు నాన్నతో చెప్పి నిన్ను కారాగారమునకు పంపుటకు ప్రయత్నించెద"నంటిని. అతడు నావంక గ్రుడ్లురిమి చూచుచు "ఆ! జైలుకి పంపుతావుగా? చూస్తాను. నీవు నన్నుతప్ప యింకెవరినీ పెండ్లాడలేవు. బాగా ఆలోచించు. ఇవాళరాత్రి 10 గం॥లకు నీవే సంగతీ నాకు తెలియజేయుము. ఈ మాట ముమ్మాటికీ సత్యము." అని క్రిందకు వెళ్ళిపోయెను. "నేనును యతని మాటల కర్థమేమాయని యాలోచించుచు యచ్చటనే కూర్చుంటిని. ఇంతలో అత్తయ్య అన్నానికి పిలవగా క్రిందకు వెళ్ళితిని. అన్నముకాగానే నాగదికొచ్చి నిద్రపోవలెననుకుంటూ ఈ డైరీలో నేడు వ్రాయవలసిన ముఖ్యాంశములన్నీ వ్రాసితిని. నాకడుపులో చేయిపెట్టి కలచినట్లున్నది. కారణమేమి?" ఇక నిద్ర పోవుదును.

ఇట్లు,
'శకుంతలాదేవి'

అని న్యాయాధిపతి యా దినచర్య పుస్తకమును చదువగా నందరూ నాశ్చర్య భరితులైరి. అంత ఆయన నారాయణగారిని, రుక్మిణమ్మగారిని యీ విషయములగురించి సాక్ష్యమడిగిరి. వారును ఉదయము జరిగినదంతయు యదార్థమనియు, సాయంకాలపు సంగతి తామెరుగమనీ, సత్యముకానిచో యామె యెందులకు వ్రాయుననియు యనిరి. అప్పుడు న్యాయాధిపతి "రాజారావు! ఇంకనూ యొప్పుకొందువా? లేదా?" అనిరి.

అంత రాజారావు తలవంచుకొని "ఇంకనూ ఎందుల కొప్పుకొనను. అంతయు ఆమె తెలిపినదికదా! మిగిలినది నేను జెప్పెదను వినుడు. ఆ రోజు సీతయ్య కత్తిని అతని యింట్లో దొంగిలించితిని. చేతిగుడ్డ శకుంతలదే. బల్లమీదయుండగా తీసితిని. దానిమీద మత్తుమందు జల్లితిని. అంత రాత్రి పదిగంటలకు యింట్లో యందరూ నిద్రించుచుండగా యా రెండు వస్తువులు తీసికొని శకుంతలగదికి వెళ్ళితిని. శకుంతల కప్పుడే నిద్రపట్టినట్లున్నది. నేనామె నిద్రను చూడలేకపోతిని. అతిక్రోధమున నామెను లేపితిని. ఆమె భయపడుచూ లేచెను. వెంటనే నేను 'శకుంతలా! ఈ నాచేతిలోయున్న కత్తినిచూచి మరీ జవాబు చెప్పుము. నన్ను పెళ్ళిచేసికొంటావా! లేదా?' అంటిని. ఆమె యతి ధైర్యముతో "లేదు" యన్నది. నేను మరల "శకూ! ఆలోచించు నీ ప్రాణములపై యాశలేదా?" అంటిని. ఆమె "సరే! పెండ్లిజేసి కొనెదను వెళ్ళుము" అన్నది. కాని నాకనుమానముగాయుండి "సరే! యీ కాగితముమీద వ్రాయుము. నిన్ను కాపాడుదునంటిని. ఆమె ససేమిరా యందుల కొప్పుకొనలేదు. నేను నాచేతిగుడ్డ నామెపై విసరితిని. ఆమె అచేతనయై పడిపోయెను. నేనామెను చంపదలచలేదు. బెదరించవలననుకొంటిని. అందులకామె యొప్పుకోలేదు. మరియును యీ విషయాలన్నీ మా మామకు చెప్పునేమోయను భయముచే 'బాకు'ను

ఆమె హృదయమునందు గ్రుచ్చితిని. ఒక్క-వ్రేటుకే యామె తన ప్రాణములను కోల్పోయెను. నేనును మెల్లగా ఆ కరవస్త్ర మాదిగాగల వస్తువులన్నియు నచ్చటనేవిడచి కాళ్ళు చేతులు కడుగుకొని, నాగదిలోని కెళ్ళవలయునని మెల్లగా తలచుచు నడచుచుంటిని. దాదాపు మూడుగంటలయ్యేను. దారిలో సీతయ్య పడుకున్నాడు. నేనతని కాలిమీద పొరబాటున కాలువేసితిని. వెంటనే యతడు బిగ్గరగా "ఎవరున్నారు?" అన్నాడు. "నేనే సీతయ్యా! వాకిట్లోకివచ్చి వెళ్తున్నాను. చూడక నీ కాలిమీద అడుగుపడినది" అంటిని. అంత నతను 'అయ్యా! మీరేనా! ఇందాక శకుంతలమ్మ గదిలో యేదో చప్పుడయినది. మీకేమైనా వినిపించినదా?" అన్నాడు. నేనును "ఎబ్బే! ఏమీ వినపడలేదు. అయినా చూద్దామురా!" యని, మేమిద్దరమూ శకుంతల గదిలోనికి వెళ్ళితిమి. ఆఘోర దృశ్యము కాంచగనే యాతడని భయముతో అమ్మను, మామయ్యను లేపెను. ఆ పిమ్మట జరిగిన విషయము మీ కందరికీ తెలియును. ఇప్పుడు నేను చాల విచారించుచున్నాను. నేనే హంతకుడను. మీరే శిక్ష విధించినను యనుభవించుటకు సిద్ధముగా నున్నాను" అని తన వాఙ్మూలము పూర్తి జేసెను. అదివిని ప్రజలందరు నాశ్చర్యభరితులైరి. న్యాయాధిపతి అందరికీ అంతయూ వివరించి తీర్పుజెప్పి హంతకున కురిశిక్ష విధించెను. ప్రకాశరావు నందరునూ చాల అభినందించిరి. మరునాడీ రహస్య భేదము గావించిన "శ్రీ శ్రీ శ్రీ డిటెక్టివ్ ఆఫీసర్ ప్రకాశరావు"ను పత్రికలన్నియు శ్లాఘించుచు ఆయన కీర్తి ప్రశంసించిరి. నిర్దోషియైన సీతయ్యను విడుదలచేసి యందరు నతనిని క్షమాపణ కోరిరి. నారాయణగారు, రుక్మిణమ్మగారు 'పాముకు పాలుబోసి నట్లాయెగదా?' యని విచారించి, ప్రకాశరావుకు 116 లిచ్చి సత్కరించిరి.

ప్రకాశరావత్యంత సంతసమున 116 రూ॥లతో యింటికొచ్చెను. రాజ్యలక్ష్మియు యాతనికొరకెదురు చూచుచుండి యఖండ స్వాగతమిచ్చెను. రాజ్యలక్ష్మి ప్రకాశరావుతో "ఏమండీ మీరుగెలిచారా? నేనుగెలిచానా"? అనెను. ప్రకాష్ నవ్వుతు "నీవేగెల్చావు. జయలక్ష్మి ఎప్పటికైనా రాజ్యలక్ష్మినే వరించును కాని ప్రకాశరావును వరించదుగా. కానీ పత్రికలన్నియు నన్నే పొగడుచున్నవి. ఇదిగో యీ 116రూ॥ లు నీవే తీసుకో." అనెను. రాజ్యలక్ష్మియు "వారు అత్యంత ప్రేమతో మీకిచ్చినవి నాకెందుకులెండి పోనీ మీకిష్టముంటే యందులో వందరూపాయిలు నాకివ్వండి. నిర్దోషిని దోషీయన్నందుకు పదహారు రూపాయలు మీరు తీసుకోండి." అని వందరూపాయలు తీసికొనెను.

అంత ప్రకాశరావు "రాజ్యం! నీమూలాననిర్దోషిని శిక్షించిన పాపం నాకు కలగకుండా పోయింది. నాకువచ్చు అపకీర్తికూడా నీ గొప్పతనముచే, నీ తెలివిచే తప్పిపోయింది. నీ వాదైరిని సంపాదింపకున్న నేనెట్లు హంతకుని పట్టుకొందును? నీ బుద్ధి కుశలతను పొగడుటెట్లో నాకు తెలియకున్నది. అర్ధాంగివన్న, ఆదర్శగృహలక్ష్మివన్న నీవేకదా? ఇకనుండీ నీ సలహాతీసికొనకుండా నేనే నేరస్తులనూ పట్టుకొనను. ఇదేనా ప్రతిజ్ఞ" అని అతడు తన ధర్మపత్నియైన "రాజ్యంప్రతిభ" ను అతి ప్రేమతో ప్రశంసించెను.

సోదరీమణులారా! ఇదంతా నిజంగా 'రాజ్యలక్ష్మి ప్రతిభే'. కాని నలుగురిలో ఆ కీర్తి మొగవాడైన ప్రకాశరావునకే దక్కింది.

మరి! "అపరాధ పరిశోధక శాఖలో ఆడవాళ్ళకు మాత్రం యుద్యోగాలెందు కీయకూడదు"?

——(:o:)——




## "తీరిక సమయాల్లో లలితకళలు"

ప్రపంచంలో భారతదేశం లలితకళలవిషయంలో పేరుప్రతిష్ఠలు సంపాదించింది. మనపూర్వీకుల అపారకృషిని కొంతకాలం మనం విస్మరించినా, తిరిగి కళాభ్యాసనకు పూనుకోవడం భావి అభ్యున్నతికి శుభసూచకం.

ఒకనాడు భారతదేశం కళాకౌశలానికి పుట్టినిల్లు అనిపించుకుంది; మనలలిత కళలు మహోన్నత శిఖరాలను అందుకున్నవి; మనకళానైపుణ్యాన్ని కళ్లారాచూచి వెళ్లుటకు విదేశీయులు మనకళాకేంద్రాలకు యాత్రలు సాగించేవారు.

తీరికసమయాల్లో స్త్రీలు వూరక పొద్దుపుచ్చడంకంటె కొన్ని లలితకళలను అభ్యసించి మనోవికాసాన్ని పొందటం సముచితంగా ఉంటుంది. చూడండి - ప్రతిగృహిణి సులభంగా అభ్యసించ గలిగినవిద్యలు ఎన్నో ఉన్నాయి. వీటికి చెప్పుకోదగినంత పెట్టుబడిగాని, పరికరాలుగాని అవసరంలేదు. ఒక కుట్టుపనివిషయం పరిశీలిద్దాం. దీనికి ఏమేమి కావాలి? సూదులు, నూలుదారం, ఉల్లు - ఇంతేగదా? వీటితో ఎంతో అందమైన వస్తువులు తయారు చేయవచ్చునుగదా? పిల్లలకు ఈ అల్లికంపని సులభంగా నేర్పవచ్చు. కళాదృష్టితో ఈ విద్యను అభ్యసిస్తే ఎంతో ఉత్తేజకరమైన వస్తువులను తయారుచేయడానికి వీలుంటుంది. గృహాలంకరణానికి శోభనుగూర్చే కర్టనులు, మేజాగుడ్డలు, పడకలమీది దుప్పట్లు, పిల్లలఉడుపులు, మరి ఎన్నోవిధాలైన బట్టలమీద కళాకౌశలాన్ని ప్రదర్శింపవచ్చు. వీటి తయారీవల్ల కొంతవరుమానాన్ని సంపాదించి, తద్వారా కుటుంబ ఆదాయాన్ని పెంపుచేసుకోవచ్చు. సరైనదృష్టితో ఈ విద్యను అభ్యసిస్తే అభ్యాసకుల దృక్పథంలో కళాకాంతులు వినూతమైనవెన్నో పొడసూపక మానవు.

విశ్రాంతి సమయాల్లో స్త్రీలు తమకుటుంబాలకు కావలసిన బట్టలు కొంతైనా సంపాదించడానికి శ్రమించాలి. ఈ విషయమై మహాత్మాగాంధి ఒకప్పుడు ఇలా అన్నారు; "నన్నడిగితే స్త్రీ విధులలో నూలువడకడం ముఖ్యమైంది అంటాను. పురుషుడు పొలాలు దున్ని పండిస్తే స్త్రీ నూలువడికి బట్టలు నేయిస్తుంది. ఈ విధంగా స్త్రీ పురుషులు జీవిత

రంగంలో అన్యోన్యసహాయం చేసుకుంటూంటే దేశం సుభిక్షంగా నుంటుంది. నూలు వడకడం దేశాభ్యుదయానికి ముఖ్యం; తద్వారా స్త్రీలు దేశసేవ చేస్తున్నారన్నమాట." అంటే ఖద్దరు పరిశ్రమకు స్త్రీ వెన్నెముక అని వారి అభిప్రాయం.

సంగీతం అతిచక్కనివిద్య. స్త్రీలు సహజంగా మంచి శారీరాన్ని కలిగివుంటారు. సంగీతాభ్యసనంలో ఒక ఆధ్యాత్మిక ఆనందం మేళవిస్తుంది – కళారాధకు కలిగే ఆనందం శ్రోతకుకూడ లభిస్తుంది. జీవితానికి వికాసాన్ని, ఆనందాన్ని ఇవ్వగలిగేశక్తి సంగీతానికి అద్వితీయంగా నుంటుంది. మన కర్ణాటక సంగీతశాస్త్రంపునరుజ్జీవింప చేయబడే మంచి రోజులు వస్తూవున్నాయి. మన త్యాగరాజు పెంచిన సంగీతతరువు మహావృక్షమై తన తియ్యని ఫలాలను ఆంధ్రదేశానికే గాక భరతదేశానికంతా అందజేసింది. ఆ మహానీయుని రచనలు మనసంగీతానికి స్వాభావికమైన భావసంపదను, కళారూపాలను ప్రతిబింబిస్తున్నాయి. కళ స్వేచ్ఛగా అభివృద్ధిపొందిననాడే ఇటువంటి వైవిధ్యమూ, స్వజనాత్మకభావశబలత రూపొందుతాయి. భారతపౌరుని కదలించేవిషయాలు శాంతి, నిర్మాణాత్మకకృషి - మనసంగీతకళలో ప్రతిబింబించాలి. మనసంగీతరచనలు నూతన భావాలకు, నవనవోన్మేషమైన స్వజనాత్మక చిత్రణకూ గాఢమైన సజీవవ్యక్తీకరణకూ పేరుపడ్డవిగా నుండాలి. సంగీతంలోనుండే మహావిశేషమేమంటే మానసికంగా ఏవ్యక్తికైనా ఏవిధమైన సంగీతంనచ్చితే దాన్నే అభ్యసనంచేయవచ్చు. మగవారికంటే మగువలప్రేళ్లు సున్నితంగా వాయిద్యాలను పలికించడంలో ప్రతిభను సహజంగా చూపగలరు. ప్రపంచంలో ఎన్నోవందల రకాలైన వాయిద్యాలున్నాయికదా? కాని మనవీణను సరిపోల్చగలిగిన వాయిద్యం ఒక్కటైనా ఉందా? వీణకువీణే సాటి. బ్రహ్మనాదాన్ని ప్రతిబింబించే మహాప్రభావం దీనిలోవుంది. ఇట్టి పవిత్రవాయిద్యాన్ని చేపట్టగలిగిన గృహిణిజీవితమే సార్థకం. మనసవనాగరిక హార్మోనియాన్ని ఎంత సిద్ధహస్తులు వాయించినాసరే వీణపలుకును పలికించగలరా? నాదస్వరం పిల్లనగ్రోవి, ఫిడేలు, మృదంగం, కంజీరవగైరా వాయిద్యాలు మనసునుఎంతో రంజింపచేస్తాయి. ఏదో ఒక వాయిద్యాన్నయినా అభ్యసించి కళోపాసకులు కావడం మన పవిత్రధర్మం.

నాట్యం లలితకళలకు రాణివంటిది. ఆవేశం, ఊహ, విజ్ఞానంఉన్నవారు ఈ విద్యను ఆరాధిస్తే దానిశోభ సర్వజనామోదాన్ని పొందగలగడం తప్పనిసరి. ఇది శారీరకంగానే గాకుండా మానసికంగాకూడ వికాసాన్ని కలిగిస్తుంది. నేడు మనసీమల్లో భరతనాట్యంలో అభిరుచి జాస్తిఅవుతున్నది. మనబస్తీల్లోవుండే స్త్రీలకే గాకుండ గ్రామాల్లోవుండే మగువలకూడ తీరికసమయాల్లో అభ్యసించడానికి అనువుగా సంగీత, నాట్యమందిరాలు

నెలకొల్పాలి. కళాదృష్టితోచూస్తే మన భరతనాట్యానికి సరిపోయినది, ప్రపంచంలో మరేదేశములోగాని లేదనేచెప్పాలి. అందుచేతనే దాని కౌశలాన్నిచూచిన విదేశీయులు ముగ్ధులైపోతున్నారు. ఈ దశాబ్దంలో మనదేశంలో నాట్యకళలకు మంచిప్రాముఖ్యత ఏర్పడింది. ప్రతిసీమలోను నాట్యకళారాధకులుంటున్నారు. పరదేశాలకెళ్లి మనకళా ప్రౌఢిమను ప్రకటించ శక్తి సామర్థ్యములుగల యువతులనేకమంది నేడు రంగస్థలంలో నున్నారు.

స్త్రీలు తీరికసమయాల్లో శిల్పం, చిత్రలేఖనంద్వారా పల్లెప్రజలకు కావలసిన కళాన్విత వస్తుసామగ్రినికూడ తయారుచేయవచ్చు. ఈ లలితకళాపరిశ్రమలో స్త్రీకే ప్రత్యేకతవుంది. స్త్రీ సహజంగా కళాస్వరూపిణి - ఆనందదాయిని - ఆమె హస్తస్పర్శలోనే కళ పుడుతుంది. కృష్ణాజిల్లాలోని కొండపల్లిబొమ్మలు, ఏలూరు తివాసీలు, చెన్నపట్నం బొమ్మలు, మైసూరు సిల్కుచీరలు, బందరు కలంకారీఅద్దకం, తిరుపతి చందనపు బొమ్మలు, తిరువాన్కూరు, విశాఖపట్టణపు దంతపుచెక్కడాలు - స్త్రీలు పనిచేస్తూన్న కళాపరిశ్రమలకు ఇంతకన్నా ప్రత్యక్షనిదర్శనాలు ఏంకావాలి ? ఈ విధంగా మనదేశంలో స్త్రీలు సంగీతంలో, చిత్రలేఖనంలో, నాటకకళలో, క్రీడలలో తమకుగల సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి.

నిజమైన కళ ప్రజలఆత్మనూ, వారిఅంతర్గత మనోభావాలను, ఆశయాలను, ప్రతిబింబిస్తుందని ఒక పురాతనమైనసూక్తి వుంది. స్వభావంలోను, స్వరూపంలోను, వైవిధ్యం గలిగిన లలితకళలలో ఉత్తమరచనలు నేటిజీవితంలోగల ముఖ్యసంఘటనలను ప్రతిబింబించాలి. ఇవన్నీ మనదేశ ప్రజలజీవితానికీ, ఆదర్శాలకూ సంబంధించినవయి స్పష్టమైన రూపచిత్రాన్నిచూపాలి. శాంతి - ప్రతిభారతస్త్రీ హృదయకుహరంలో ప్రతిధ్వనించేది యిదే. కళారచనలు ఆనందాన్ని శాంతియుతమైన కృషిని ప్రతిబింబించాలి. శాంతి ! మనకళలో సాధారణంగా కానవచ్చే ముఖ్యాంశంగా నుండాలి. శాంతికి అంకితంచేయబడిన చిత్రాలు తక్కినవాటన్నిటికంటె, మనకళాకారులకు ప్రజలతోగల సన్నిహిత సంబంధాన్ని వ్యక్తపరుచుతున్నాయి. దివ్యశాంతిగానం - మనకళకు చుక్కాని.

భారతనారీమణులు పరిశ్రమచేస్తే లలితకళల్లో సాధించరానిది అంటూవుండదు. అందుచేతనే ఓ మహాకవి "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దారనేర్పించినన్" అని సత్యాన్ని చాటిచెప్పారు.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

పెల్లకూర్ సుభద్రాదేవి.




# కామిర్లు

ఈ జబ్బు ప్రమాదమయినది. తగుశ్రద్ధవహించి చికిత్సపొందనిచో ప్రాణహాని వాటిల్లును.

ఈ వ్యాధి సాధారణముగా దీర్ఘకాలము జ్వరముచే బాధపడి దానిఫలితంగా రక్తము క్షీణించిన సందర్భమున సంభవించి దేహము, కండ్లు పచ్చబడిపోవును. వారి మూత్రము పచ్చగా వెలువడును.

మనవారు యీ వ్యాధికి మంత్రములని, ధారములని, తాయిత్తులని వాడుతుంటారు. వానితోబాటు మన కందుబాటులోనున్న చికిత్సలనుకూడ చేసికొనుట మంచిది.

మనకు కరక్కాయ, చింతచెట్టు, జాజికాయ, తేయాకు, ఉసిరిక, పసుపు మొదలగునవి సాధారణముగా లభించునవి. వీనితో కామిర్లువ్యాధికి చికిత్సచేసుకొని వ్యాధి నివారణ మొనర్చుకొనవచ్చును.

కరక్కాయ:-కాయలచూర్ణమును రెండుమొదలు 4 చిన్నముల ఎత్తువరకు తేనెలో కలిపి దినమునకు రెండుపూటలు సేవించినచో వ్యాధి నివారణమగును.

చింతచెట్టు:-చింతాకురసమును 4 మొదలు 8 తులములవరకు దినమునకు రెండుపూటలు యీవ్యాధిగ్రస్తులు సేవించనగును.

జాజికాయ:_ఇది సుగంధద్రవ్యములలో నొకటి. దాని వైద్యోపయోగముకూడ చాల ఉత్తమమయినది. కామిర్లు వ్యాధిగ్రస్తులు దీనిచూర్ణమును 2 మొదలు 20 గోధుమ గింజల ఎత్తువరకు వయస్సును, శరీరతత్వమునుబట్టి జాగ్రత్తగా వాడవలెను. కాకతత్వము, రుద్రవాతము రాతగినతత్వముకలవారు సేవించరాదు.

తేయాకు:- తేయాకు వేసితీసిన తేలికకషాయమును కొద్దిగా చక్కెర, పాలతో సేవించినచో త్వరగా ఆరోగ్యము చేకూరును. ఇది రోజుకు రెండుసార్లు పుచ్చుకొనవచ్చును.

పసుపు:- పసుపు ఉపయోగం మనదైనిక జీవితములో విస్తారం. వంటకములలో సయితము పసుపును వాడుచున్నాము. దానిని పూటకు 20 మొదలు 40 గోధుమ గింజల ఎత్తువరకు లోపలికి సేవించుటవలన గుణముకలదు.

ఈ వ్యాధిపీడితులు పథ్యము విషయములో విశేషశ్రద్ధ వహించవలెను. క్రొత్త బియ్యపు అన్నము, చద్దిఅన్నము, మినుములు, ఆవాలు, పులుపు వస్తువులు, తాంబూలము, అమిత ఉదకపానముల వర్జించవలెను.

పాతబియ్యపు అన్నము, గోధుమలు, కందిపప్పు, పెసరపప్పు, పీటికట్లు, చరుకు రసము, పొట్లకాయ, బీరకాయ, బూడిద గుమ్మడికాయ, లేతఅరటికాయ, పాలకూర, పొన్నగంటికూర, చిర్రికూర, తెల్లగలిజేరుకూర, వెల్లుల్లి, నీరుల్లి, ఉసిరికాయ, మజ్జిగ, నెయ్యి, వెన్న, నూనె, ఉష్ణోదకము, వగరుపదార్థములు పథ్యములు.

కారము, ఉప్పు పూర్తిగా వదలిపెట్టి విశ్రాంతి తీసికొనుటవలన త్వరగా ఆరోగ్యమును పొందగలరు.

"సిసి"

——(:o:)——

# 'ప్రథమాంధ్ర కవయిత్రి'

(తాళ్ళపాక తిమ్మక్క)

విద్వాన్ కాలకంధరం సంజీవరాయశర్మ

ఆంధ్రవాఙ్మయ కల్పవృక్షమునకు మహోన్నతమగు సొంపుకై చేసిన కవయిత్రులు పెక్కురుండలరు. శ్రీకృష్ణదేవరాయల కాలమున "అల్లసాని వాని అల్లిక జిగిబిగి యొకవంక, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు లోకచక్కి, తెనాలివాని తెనుగు తేట నుడులు, పదగుంభనంబులును, రామరాజ భూషణుని సంస్కృత పదజటల ద్రాక్షాగుళుచ్ఛములును, పింగళివాని శృంగార రససమన్వితంబును, ధూర్జటి అపార కళానుభవ ప్రసక్తియు, నవ్యభాషా శతావధాని గుంభనంబులును, కలిగి ప్రబంధ వృక్షము సర్వాలంకారణ సహితమై మొగ్గతొడిగి పూలుపూచి కాయలుకాచి పరిపక్వదశలో పండుపండినది. ఆనాడు "దేశభాషలందు తెలుగులెస్స" అనురాయల అక్షర రూప బహుమానము అక్షరరూప బహుమానమనుటలో అతిశయోక్తి కడము లేదు. అట్టి కాలమున మొల్లకవయిత్రితో నుల్లమలర మల్లెమొల్లలకై చేసి తెనుగు తల్లికి యొడగూర్చిన రామాయణము యెల్లర మదులను ఆనంద డోలికలలో నూచిన దన్న దాని ప్రత్యేకత తెలియుచున్నదికదా! ముద్దుపళని ముదిపింపు నటనలతో ముగ్ధమోహన కళాసౌందర్యము తన కృతిలో వ్యక్త మొనరించినది. తరిగొండ వెంకమాంబ అద్వైత రసానుభూతి తన కృతిలో చక్కగా చాటినది. ఇదియిట్లుండ ఎల్లర కన్నను తొలుతనే వెలసిన కవయిత్రి "తాళ్ళపాక తిమ్మక్క" ఈమెకృతిని గ్రంథరూపమున ప్రకటించి ఆంధ్రుల మన్ననలకు పాత్రులైనవారు శ్రీ కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, అయినను ఈ గ్రంథము వీరికన్నను పూర్వమే శ్రీ చింతాదీక్షితులవారు కనిపెట్టిరనవచ్చును. శ్రీ కీ. శే. గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి సప్తతిని జన్మసంచిక "వ్యాససంగ్రహము' గ్రంథమున స్త్రీలపాటలనుగూర్చి వ్రాయుచుతిమ్మక్క కృతియగు సుభద్రాకల్యాణమునుండి పదరీతిగనందు కొంత భాగము గైకొనియుండిరి. కావున తిమ్మక్క కృతిని ఆనాడు గుర్తించిన వారికి ఆంధ్ర కవయిత్రి లోకము అగ్రతాంబూలము నర్పింపవలయును. ఇట్లనుటచే శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని కించపరచుటకాదు.

తాళ్ళపాక తిమ్మక్క, తాళ్ళపాక అన్నమయ్య సతీమణి. పదకవితకు ఈయన పితామహుడు. ఈయన పదప్రయోగవైచిత్రి అపారము, అనన్యము. అట్టివారి సతీమణియే గేయరూపమున వెలయించిన సుభద్రా కల్యాణము కడుమంచి తేటపలుకులతో గులుకరించినది. ఈమె యింతులకథలన్ని ఏవగింపుతో చూతునుట?

"ఇంతుల కథలైన - సెంతవారికిని
చింతింపమదిలోనఁ - జీకాకుగదురు"

అని పలికినది. ఈమె సంగీత సాహిత్యములలో నందెవేసిన చేయి యని కృతియే చాటుచున్నది. (1) "ఈ సుభద్రా కల్యాణము ద్విపదమంజరీ వికారమనతగిన గేయరచన" (2) "దీని వ్రాత ప్రతిలిపి పాటపాడెడి తీరున దీర్ఘాక్షరములతో నున్నది." అని శ్రీ వే. ప్ర. శాస్త్రిగారు నుడివిరి. పైని వారు వచించిన దానికన్నను క్రిందిది సత్యమునకు దవ్వు, ఈక్రింది పాదములందుకు నుదాహరణములుగా గ్రహింపనగును. ఈమె తన కృత్యంతమున నీ గ్రంథములను "పాట" యేనని వచించుకొన్నది. "సుభద్రా కల్యాణమను పాట కడు మంచి తేటపలుకుల" నీటు గులుక రచించినది.-

"అమ్మారా ముద్దుల - గుమ్మరావేగ
కొమ్మరా నవకంపు - బొమ్మరావమ్మ
ముత్యాల సరమరా - ముద్దురాలా రా
చిత్తజు బాణమా - చెలియరావమ్మ
చిలుకలకొలికి రా - శృంగార కన్య
తొలకరి మెఱుపరా - తోయజగంధి
పండులవెన్నెలరావె - భాకీర్తి రావె,
గండుకోవెలరావె - కమలాక్షిరావె
మచ్చెకంటీ రావె - మాధవళిరావె
అమృతంపు తెప్పరా - అరవిరిమొగ్గరా
బంగారపెట్టెరా - భాగ్యాలభరణి
వెలయ ముజ్జగముల - వింతయై నట్టి
శ్రీ కలాచిరుదుల - చెలియరావమ్మా"

ఇందుకొన్ని పాదములకు దీర్ఘములిచ్చినచో "చందమామా రావె జాబిల్లి రావే" అన్న పదమురీతి యగుచున్నది. దానిని ననుసరించియే నీపాట కడుమంచి తేట పలుకులతో రచించెనేమో!

ఈ విధముగా రచించి పాఠకులకు "చిటిబెల్లములను చెఱకు బిళ్ళలు మంచి చిరుతిండి సరకుగా" బంచియిచ్చినది. (3) "ఈ కృతి నన్నయ భారత కథను నధికముగా ననుకరించుచున్నది." అనుకరించుచున్నను చేర్పులు కూర్పులు మార్పులు నయితము గలవు.

"వనితసన్యాసిని - వలపించుకొంటి
రామావతారా - నరమణిరోనీవు
అలఋష్యశృంగుని - అటులోనుజేసి

వలవేసుకొంటివే - వనితరో నీవు
దేవేంద్రసుతుదృష్టి - తెగువతోఁ దాకె
దృష్టితీయింతుమే - తెలివిరా నీకు ॥"

ఇత్యాదిగా కథాసంవిధానము సముపూర్చినది. సుందోప సుందోపాఖ్యానము నన్నయభారతమునఁ జెప్పఁబడియున్నది. ఇందు "సుదతిక్రై సుందోపసుందుల చరితవిదితముగ జెప్పెదను. వినుడంచుఁబలికె సుందరికొఱకు నై నూడుపుట్టంగ సుందోపసుందులు మ్రందిమన్నైరి" అనిమాత్రమే వచించినది.

పాత్రపోషణావిధానమున నౌచితియను దివ్వెను కరమునసుంచుకొని రచించినది. "సుభద్ర తనమనములో తాత్పర్యము ననుదిత్సౌఖ్యరసలత చిగిరించగాను ఉత్సాహమున మేనునుబ్బి పొంగగను పలుకుపలుకున తేనెవలుకగా" భావతోఁబలికె. తిమ్మక్క యర్జునుడు నర్థాంతరములు బలుకుటయందు మేటి.

"పద్మాక్షి నీతోను - బలుకగా వెఱతు,
పలికినపలుకుల - భావమేర్పఱచి
దూఱులెక్కించెదో - తోయజాక్షునకు
పలపుకల్గకుండ - పలుకకల్గుదునె
పడుచుఁదనమునసే - పల్కు పలుకులను

"మనసులోనఁ తవానను రాజురుషిని అనమాటలు విని యర్థాంతరములు"

ఇందలియర్థాంతరముల "సుభద్ర" యెఱిగినప్పటికి చిక్కని నెమ్మదిని జరిగి విచారించి తిన్ననిమాట తేటలాలించినది. ఇక నర్జునుడన్ననో సన్నంపు సదరంపు చామవర్తింపు మొలకనవ్వుల దీపిముగ దకెమ్మోని. ... ...

తిలకించిపులకించి కలఁజూచిచూచి తలయూచి విజయుండు" విజయుని వేదనబాగు వర్ణించినది "ఏనుఁగు నెక్కి - దిడ్డు మూరుదురె" "గరిమ కేసాలెల్ల గ్రాసాలకొఱకె," ఇత్యాది నిత్యమువాడు సామెతలు ప్రయోగించినది. ఈ చిన్నకృతిని తాళ్ళపాక తిమ్మక్క ద్విపదలో రచించియుంట విశేషములో విశేషము. "ద్విపద యైహికాముష్మికములగు హేతువని పాల్కురికి సోమనాథుండు వచెంచెగదా! అసలు తాళ్ళపాకకవులలో ప్రసిద్ధివహించి చిన్నన్న" ద్విపదలో, గృతులసంతరించినాడు. తాళ్ళపాకకవులు పెక్కురు ద్విపదరచనము గావించినవారే యున్నారు, తెనాలి రామకృష్ణకవి.

"చిన్న ద్విపద కెఱగును
పన్నగ పెదతిరుమలయ్య పదమున కెఱఁగున్ "

అని పొగడినాడు. ఈవిధములగునవి యటుండ ఈచిన్న కృతిని ఆడువారు సైతము చదివి ఆనందింపఁ దగినదిగా నున్నది. భాషా, భావము, కుదిరిగా నిమిడించినది. ఇట్టికృతి సర్వజన రమణీయ మయినదని వేఱుగా వచింప నక్కర లేదు.

(4) ఈపాటలోని పలుకుబళ్ళు కొన్ని కొన్ని చేమకూర వెంకటకవి **విజయ** విలాసమునఁ జేరినవి అనిరి.

అందు కుదాహరణముగా విజయవిలాసమందలి "ఎగుబుజంబులవాడు - మృగరాజు మధ్యంబు, పుడుపుచ్చుకొనునె - నడుమువాడు" అన్న పద్యమునకు తాళ్ళపాక తిమ్మక్క కృతియందలి "ఎగుభుజమ్ములవాడు - మృగరాజు నడుము, నడచి పుచ్చుకొనునెన్నడుమువాడు." అన్న ద్విపదలను పుడికి పుచ్చుకొన్నాడు. ఇట్టివాతని కృతిలో మిక్కుటములుగా గలవు. తాళ్ళపాక తిమ్మక్కయే స్త్రీలపాటల నాధారముగాఁ జేసికొని యీకృతి రచించి యుండునేమో! పరిశీలింపవలసియున్నది.

(1, 2, 3, 4, అంకెలు శ్రీ వే. ప్ర. శాస్త్రి గారి గ్రంథములోని పీఠికయందలిది.)

# లోకవార్తలు

అక్టోబరు నెల 31 వ తేదీన కాశ్మీరు భవిష్యత్ నిర్ణయానికి రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం ప్రారంభమయింది.

◆ ◆ ◆

వచ్చే సంవత్సరమునకు 8 లక్షల ఆహారధాన్యములు కావలెననియు, అందు 4 లక్షల టన్నులు బియ్యము, మిగిలినవి గోధుమలు, జొన్నలు కోటా యివ్వాలని మదరాసు రాష్ట్రప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరిందట.

◆ ◆ ◆

తిరుపతి దేవస్థానం బోర్డువారు తిరుపతిలో ప్రారంభించనున్న స్త్రీల కళాశాలను మద్రాసు విశ్వ విద్యాలయమున కనుబంధం చేయుటకు అనుమతించవలసినదిగా ప్రభుత్వ అధికారులను కోర తీర్మానించుకొన్నారు.

◆ ◆ ◆

శ్రీ టంగుటూరు ప్రకాశంగారు రాష్ట్ర అసెంబ్లీకి మదరాసు నగరంలోని హార్బరు నియోజకవర్గము నుండి పోటీచేయాలని నిశ్చయించుకొన్నారు.

◆ ◆ ◆

రాష్ట్రపతి భవనమునుండి వెలువడిన ప్రకటనలో భారతరాజ్యాంగ శాసనములోని 280 (1) సూత్రము ననుసరించి ఫైనాన్సు కమిషను సభ్యులపేర్లు, దాని అధ్యక్షుడుగా శ్రీ కె. సి. నియోగి నియామకము తెలియజేయబడినది.

◆ ◆ ◆

22 కోట్ల రూపాయల వ్యయంతో సింద్రీలో స్థాపించబడిన ఎరువులను తయారుచేసే ఫ్యాక్టరీ అక్టోబరు నెల 30-వ తేదిన పని ప్రారంభించింది. అయిదారు నెలల వ్యవధిలో రోజుకు వెయ్యిటన్నుల అమోనియం సల్ఫేటును యీఫ్యాక్టరీ తయారు చేయగలదు.

◆ ◆ ◆

శ్రీమతి దుర్గాబాయ్ రాజమండ్రినుండి, శ్రీమతి రాజ్యం సిన్హా విజయవాడనుండి కాంగ్రెస్ పక్షం తరఫున ప్రజా ప్రతినిధుల సభకు పోటీ చేస్తున్నారు.

◆ ◆ ◆

కాశీజిల్లాలో స్త్రీ తన భర్తకు ద్రోహం చేసిందని కులపెద్దలు ఆమె పాతివ్రత్యాన్ని పరీక్షించేందుకు పచ్చి ఆకుల కంకణాలను ఆమె చేతులకు కట్టి ఎర్రగా కాలిన యినుప చువ్వలను చేతులలో నుంచి 7 అడుగులు నడువవలసినదని శాసించారు. ఆమె అట్లేచేసింది. చిత్రం! ఆమెచేతులు కాలలేదు; ఆకులు వాడలేదు. ఆమె పతివ్రతగా గుర్తించబడి సగౌరవంగా బంధుజనుల వద్దకు చేర్చబడింది.

◆ ◆ ◆

భారత ప్రభుత్వ అహ్వానముపై ప్రపంచ బ్యాంకు భారత దేశమునకు ఒక ప్రతినిధి వర్గాన్ని పంపుతున్నది. వారు దేశములోని ఆర్థిక వ్యవస్థను, పరిస్థితులను పరిశీలిస్తారు. దాంతోబాటు ఇండియా ప్రభుత్వము తలపెట్టిన అభివృద్ధి ప్రణాళికలను, వాటి కార్యాచరణను, దానికయ్యే వ్యయాన్ని పరిశీలించి భారత ప్రభుత్వము అర్థించే ప్రణాళికల సందర్భంలో ప్రపంచ బ్యాంకుకు నివేదికలను సమర్పిస్తారు.

◆ ◆ ◆

తాము రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నిక అయినప్పుడు ఆంధ్రశాసన సభలోనే కూర్చుంటానని శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు దీక్షా పత్రాన్ని స్వామీ సీతారాం గారికి సమర్పించారట.

♦ ♦ ♦

రైల్వే ప్రయాణీకుల సౌకర్యముల కొరకు భారత రైల్వేశాఖ వచ్చే అయిదు సంవత్సరములలో 3 కోట్ల రూపాయలు ఖర్చుపెట్ట బోతున్నది.

♦ ♦ ♦

కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీతో మైసూరు జనతాపార్టీ కలిపివేయడానికి ఏకగ్రీవంగా తీర్మానించబడింది.

♦ ♦ ♦

దేశమంతట్లోను ప్రజాప్రతినిధుల సభకు, రాష్ట్ర శాసన సభలకు కాంగ్రెస్ అభ్యర్థులుగా తమను నిర్ణయించ వలసినదిగా కోరుచు కాంగ్రెస్ ఎన్నికల సంఘానికి 35000 దరఖాస్తులు వచ్చినట్లు తెలుస్తున్నది.

♦ ♦ ♦

అవసరమయినప్పుడు నిర్బంధ సైనిక సమీకరణ సాగించేందుకు వీలుగా ఈజిప్టు ప్రభుత్వము ఒకబిల్లు తయారు చేయుచున్నది.

* ♦ ♦

ప్రభుత్వ కార్యాలయాలకు విదేశీ సిరాకొన మద్రాసు ప్రభుత్వము నిర్ణయించింది. ఈ నిర్ణయం దేశీయ సిరాపారిశ్రామికుల ఆశ్చర్యనిమగ్నులుగాను, భయభ్రాంతులుగాను చేసింది.

♦ ♦ ♦

తూర్పు బెంగాలులో ఉప్పుక్షామ ఫలితంగా సేరు 1-కి రు 10-లు అమ్మబడుతున్నదట.

♦ ♦ ♦

నేతాజీ సుభాస్ చంద్రబోస్ అనుచరుడు కృష్ణ కుమార్ చటర్జీ జనరల్ ఎన్నికలలో ప్రధాని నెహ్రూగారితో పోటీచేయుడానికి నిర్ణయించుకొన్నాడు.

♦ ♦ ♦

అమెరికాలోని క్లీవ్‌లెండ్‌లో ఒకవృద్ధ వైద్యుడు "ఇన్‌క్యుబేటర్" యంత్రమును రూపొందించి అనేకమంది పసిపాపలకు ప్రాణభిక్ష పెడుతున్నాడు. ఈ యంత్రము నవమాసములు నిండకముందే జన్మించిన శిశువులు జీవించడానికి, జన్మకాలమందు తూకం తక్కువగా జన్మించిన వారికి శ్రీరామ రక్షగా నుపకరిస్తున్నది.

♦ ♦ ♦

సుప్రసిద్ధ అమెరికన్ ఫిలిం నిర్మాత, దర్శకుడు అయిన గాబ్రియల్ పాస్కల్ గాంధీజీ జీవితమును చలనచిత్రంగా తయారు చేయడానికి త్వరలో ఇండియాకు రాగలడట. ఈచిత్రములో కొన్ని భాగములను ఆఫ్రికాలోను, కొన్ని భాగములను ఇండియాలోను తీసెదరు. ఈచిత్రము అమెరికాలో ప్రదర్శనార్థము ఉద్దేశించబడినది.

♦ ♦ ♦

ప్రపంచములో నిలువయున్న ముడిగంధకములో 11 వేల టన్నులు ఇండియాకు కేటాయించుచు వాషింగ్‌టన్‌లోని అంతర్జాతీయ పదార్థ వినిమయ సంఘం తీర్మానించింది.



# మా మి డి



## మామిడిపండ్ల తేటపులుసు

మామిడిపండ్లు చిన్నచిన్నవిగా యుండేవి, యేరి కొని తేవలయును. బాగా నీటియందు శుభ్రపరచి తొడిమెలు తరిగి తగిన పాత్రలో ఉడికించవలయును.

1 సేరు పులుసుకు మోతాదు:-

ఎండుమిరపకాయలు 8 లేక 10, సెనగపప్పు పిడికెడు, బియ్యము పిడికెడు, దనియాలు రెండు చెంచాలు, మెంతులు చిటికెడు, కాస్త ఇంగువ బాణలిలో వేసి 1 చెంచానెయ్యి లేక నూనెవేసి ఎఱ్ఱగ వేయించి తీసి మెత్తగ పొడి చేయవలయును, కొంత ఎండు కొబ్బెర కోరు, పొడిచేసిన మిరపపొడి తగినంత ఉప్పు ఉడుకుచున్న మామిడి పండ్లలో వేయవలయును. ½ చెంచా పసుపుపొడి వేసి చక్కగా సువాసన వచ్చువరకు ఉడికించి కాస్త కర్వేపాకు వేసి దించవలయును. 1 తులము నూవులనూనె 1 చెంచా ఆవాలు వేసి చిటపటయనగనే మసలిన పులుసుయందు వేసి తీసి యుపయోగించ వలయును. ఇదేవిధముగ జీడి పండ్లతోను చేయవచ్చును.

## మామిడికాయ పులిహోర

పుల్లమామిడికాయ 1టి కొబ్బెర తురుములో కోరి యుంచవలయును. తెల్లని బియ్యము 2 అళాకులు అన్నము చేసి యుంచవలయును. ఆ తర్వాత పచ్చికొబ్బెరకాయ 1టి కోరుకొని, 10 లేక 12 ఎండు మిరప కాయలు, ½ చెంచా ఆవాలు కాస్త ఇంగువ తగిన యుప్పు అన్నికలియ మెత్తగ రుబ్బి వార్చియుంచిన యన్నమున వేసి యుంచవలయును. బాణలిలో 2 పలములు నువ్వులనూనెపోసి 1 చెంచా ఆవాలు వేసి చిటపట యనగానే 1 పిడికెడు శనగపప్పు, ½ అళాకు వేరుసెనగ గింజలు వేసి ఎఱ్ఱగ వేగిన తర్వాత, కాస్త కరివేపాకు 1 చెంచా పసుపుపొడి వుంచుకొన్న అన్నమున వేసి బాగుగ కలియబెట్టి ఉపయోగించ వలయును.

## మామిడి బెరడు

మామిడి బెరడు ఎండినది తెచ్చి వేరుగ కాల్చి బూడిదచేసి సీసాయందు భద్రపరచ వలయును. వేసవి యందు పిల్లలకు పెద్దలకు దేహమున కురుపులు, బొబ్బలు, తీట ఇలాంటివి సంభవించుట కలదు. అట్టి వారికి ఈ ఔషధ మెంతయు ఉపయోగమయినది. మంచి కొబ్బరినూనె 1 చెంచా, మామిడి బూడిద 1 చెంచావేసి ఉదయపు ఎండయందు 4 గంటలుంచి తీసి కురుపులకు పట్టించ వలయును. ఇట్లు చేసిన కొద్ది దినములలోనే కురుపులు మాయమై ఆరోగ్యము గలుగును.

## మామిడి ముట్టెలు, పప్పులు

ఊరగాయలు వేయునప్పుడు తరిగి మిగిలిన మామిడి ముట్టెలను ఉప్పున నాననిచ్చి, బాగుగా ఎండ బెట్టి తీసి భద్రపరచ వలయును. ఇవి ప్రతి యిండ్లయందు యుండుట మంచిది. ఎప్పుడైన పిల్లలకుగాని పెద్దలకుగాని విరేచనములు, అందు రక్తము, బంక పడుట మొదలగునవి గలుగుచుండును. అటుల సంభ వించునపుడు మామిడి పప్పును మెత్తగ నూరి తేట మజ్జిగయందు కలిపి యిచ్చిన యవి నివారణమగును. మోతాదు, చిన్నపిల్లలకు రెండు లేక మూడు గింజలవరకు యుపయోగించ వచ్చును. అంతకుపై బడ్డవారికి 4 నుండి 6 వరకు ఉపయోగించ వచ్చును.

కొన్ని ఇండ్లయందు చద్దియన్నమునకు కూటినీరు యుంచుకొనుట గలదు. అది పుల్లగా నుండును. దానిని కలరా సంభవించినపుడు 1 అళాకు, కూటినీరునందు 4 గింజలవరకు నూరికలిపి 3 గం. కు ఒక పర్యాయము ఇచ్చుచుండిన యెడల ఆవ్యాధి నివారణమగును.

ఎమ్. ఆర్. సీతమ్మ




కాశ్మీరు రాజ్యాంగపరిషత్ తాత్కాలికాధ్యక్షుడు మౌలానామహమ్మద్ మసూది పరిషత్ ప్రారంభసమావేశంలో నిట్లు ఉద్ఘాటించిరి.

కాశ్మీరు ప్రజల తరఫున యీ పరిషత్ చేసే నిర్ణయాన్ని ప్రపంచమంతా అంగీకరించేరోజు తప్పకుండా వచ్చితీరుతుంది.

◆ ◆ ◆

మదరాసు విజిలెన్సు సంఘం 26 వ వార్షికోత్సవ సందర్భమున న్యా॥ బషీర్ అహమద్ సయ్యద్‌గారు మాట్లాడుచు నిట్లనిరి:

శాసనం చేసినంతమాత్రమున వ్యభిచారవృత్తి పూర్తిగా అంతరిస్తుందని అనుకోడానికి వీల్లేదు. ఈ కార్యక్రమ సాఫల్యానికి ప్రజలు ...కృషిచేయాలి.

◆ ◆ ◆

ప్రధానమంత్రి నెహ్రూ విలేఖరులతో మాట్లాడుచు నిట్లు ప్రకటించిరి:

పాకిస్థాన్‌తో నిరాక్రమణ ఒప్పందంచేసుకొనడానికి నేను సిద్ధంగానున్నాను. ఒకరిమీద నొకరు దురాక్రమణ జరుపకుండా అటువంటిఒప్పందం నివారిస్తుంది.

◆ ◆ ◆

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు రాజకీయపార్టీలకు చేసినవిజ్ఞప్తిలో నిట్లుకలదు.

ఎలెక్షను మీటింగులలో కొన్నిమర్యాదలను పాటించవలసిన సందర్భములో ప్రజాప్రాతినిధ్యపు చట్టం శక్షన్ 127 ను గమనించుట అవసరము. దానిక్రింద ఎలెక్షన్ మీటింగులలో అల్లరిచేయుట శిక్షార్హము చేయబడింది. ఓటరులుగల ఉపన్యాసముల వినేహక్కును ఏవిధంగాను భంగముకలుగకూడదు. లేనియడల రాజకీయపార్టీల మంచిచెడ్డలను పరిశీలించి ఓటింగుఅధికారమును వినియోగించే అవకాశముండదు.

◆ ◆ ◆

ఇండియాప్రధాన న్యాయమూర్తి శ్రీ హెచ్.జె. కనియాగారి మరణమునకు విచారమును తెలుపుచు సర్ అల్లాడి కృష్ణస్వామిగారు చేసినప్రకటనలో నిట్లుకలదు:

శ్రీ కనియాగారు ఉద్యోగగౌరవాన్ని, న్యాయపరిపాలనా స్వాతంత్ర్యాన్ని కడుజాగ్రత్తతో కాపాడినారు. ఆయన విశేష ప్రతిభావంతుడైన న్యాయమూర్తి. అతని మరణంవలన దేశానికి గొప్పనష్టం వాటిల్లినది.

—o—

# సంపాదకీయములు

## ప్రజారోగ్యం - ప్రభుత్వము

అక్టోబరు ది 15 న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ ఆరోగ్య శాఖమంత్రి శ్రీ కళా వెంకటరావు గారు ప్రజారోగ్యమును కాపాడుటకు ప్రభుత్వము సంకల్పించుకొన్న విధానములను వివరించారు. అదే సందర్భంలో ప్రజలను ఆరోగ్య వంతులుగా నుంచుట ప్రభుత్వ యుద్దేశ్యమనియు, ఇది ప్రతియొక్కరు శుచిగాను, ఆరోగ్యముగా నున్ననే కాని సాధ్యంకాదన్నారు.

ఈ మాటలు పరస్పర విరుద్ధంగానున్నవనడం సాహసంకాదు. అంటే ప్రజలలో అనారోగ్యం పెరుగుతున్నదానికి కారణాలను తెలిసికోనిదే ప్రభుత్వం ఆరోగ్యాభివృద్ధికి కృషి చేయలేదు. ప్రజలు ఎవరును అనారోగ్యంగా నుండాలని ప్రాకులాడరు. ప్రతివారు శుచిగా ఆరోగ్యంగా నుండాలనే ప్రయత్నిస్తారు. కాని పరిస్థితులు అనుకూలించనప్పుడు ఏమి చేయాలి ?

అనేకమంది ప్రజలు ఒంటినిండా శుభ్రమైన గుడ్డకు అవకాశం లేనివారున్నారు. ఉండటానికి ఆరోగ్యకరమైన వసతిలేక అలమటిస్తున్నవారున్నారు. క్రమమైన కల్తీలేని ఆహారం మచ్చుకైనా కనుపించడంలేదు. ఇక యీ కారణములవలన అనేక రోగాలకు గురియై వైద్యసహాయం లేక బాధపడుతున్నవారు, చనిపోతున్నవారి సంఖ్య విశేషముగానున్నది. ఇట్టి ప్రజానీకమును ఉద్ధరించడానికి ప్రభుత్వము చేసిన సహాయం అత్యల్పమని చెప్పకతప్పదు.

వైద్య సహాయమును విరివిగా సమకూర్చడం ప్రభుత్వ ధర్మం. ఆరోగ్యకరమైన ఆహారము, గృహ వసతి, కట్టుకోడానికి గుడ్డ సమకూర్చకలిగిన ప్రభుత్వమే సార్ధకమనిపించుకొంటుంది.

## వ్యభిచార నిర్మూలనము

సంఘములోని వ్యభిచారమును ప్రతివారు గర్హిస్తారు. కాని ఈ దురాచారము దినదినానికి పెరుగుతున్నదే కాని తగ్గటంలేదు.

అసలు వ్యభిచారమునకు కారణములు సంఘములో నింకా నమ్మకాలలో నున్న అర్ధములేని పూర్వాచారములే. బాల్యవివాహాలు, బాలవితంతువులకు వివాహములయెడల వ్యతిరేకత మొదలైనవి.

యుక్తవయస్సువచ్చి స్త్రీపురుషులు ఒకరినొకరు నచ్చి వివాహం చేసికొనే పరిస్థితులలో వ్యభిచారము కొంత అరికట్టబడుతుంది. అట్టి కుటుంబజీవనము సుఖప్రదంగాను బాధ్యతాయుతంగా నుంటుంది.

భర్తచనిపోగా పునర్వివాహము చేసికొన కుతూహలముగల వితంతువులకు వివాహము చేయడం శ్రేయస్కరం. బలవంతంగా వివాహము చేయని కారణంవలన రహస్యంగా వారవలంబించే అవినీతిమార్గాలు గౌరవప్రదమైనవని ఎవరు చెప్ప సాహసించగలరు ?

ఇక మోజు, విలాసములకని వ్యభిచారమునకు సమకట్టినవారిని సక్రమమార్గములలో నుంచగలది విడాకులపద్ధతి. భర్త అవినీతిపరుడై ప్రవర్తించుసందర్భమున అతనిని సరియైనమార్గమునకు త్రిప్పప్రయత్నించి విఫలమైనచో విడాకులివ్వడానికి అవకాశం ఉండాలి. అలాగే భార్యనడతలో లోపమున్నపుడు




వయోజన విద్య: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు యం. ఎ. ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు, పటమటలంక (వయా) విజయవాడ వెల పుస్తకము 1-కి 0-5-0.

మొదటి, రెండు పుస్తకములు మా కార్యాలయము చేరినవి.

వయోజన విద్యావ్యాప్తికి గ్రంథకర్త చేయుచున్న కృషి, చాల ప్రశంసాపాత్రమైనది. వయోజన విద్యావ్యాప్తి ఆవశ్యకతను ప్రభుత్వ దృష్టిలోనికి తెచ్చి, ప్రభుత్వముచే ఉపాధ్యాయులకు వయోజన విద్యా బోధనా శిక్షణకేంద్రాలను ఏర్పాటుచేసి ఉద్యమాన్ని సర్వతోముఖాభివృద్ధి నొందుటకు తమ యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు.

వయోజన విద్యా ప్రచారమునకనువైన పుస్తకములు యీ రెండున్ను. మొదటి పుస్తకము, అక్షరజ్ఞానము అభివృద్ధి కనవుగా చిన్న చిన్న పాఠములు కూర్చబడినవి. రెండవపుస్తకములో క్రమంగా భాషాజ్ఞానము నలవరచుకొనుట కవకాశముండునట్లు పాఠములు కూర్చబడినవి.

సులభంగా వయోజనులు విద్య నభ్యసించడానికి తగిన రీతిగా సరళమైన భాషలో పెద్ద అక్షరములతో నీ పుస్తకములు తయారైనవి. ఈ పుస్తకములు తప్పక విద్యాభివృద్ధికి తోడ్పడగలవు.

గ్రంథాలయ ప్రచారం – విజ్ఞానవ్యాప్తి, గ్రంథాలయసూత్రాలు, తెలుగుపుస్తకాల వర్గీకరణము: పాతూరి నాగభూషణంగారు. ప్రకాశకులు: ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమటలంక (వయా) విజయవాడ.

గ్రంథాలయప్రచారం – విజ్ఞానవ్యాప్తియను చిన్నపుస్తకంలో మనగ్రంథాలయాలకు ప్రజలెక్కువగా నాకర్షింపబడేటందుకు సాయుపదేసంగతులు మొదటి భాగములోనున్నవి. రెండవభాగములో ప్రజలలో విజ్ఞానవికాసాలకు పెంపొందించుట కుపకరించు కార్యక్రమములున్నవి. ఈ పుస్తకం గ్రంథాలయోద్యమ వ్యాప్తికి విశేషముగా నుపకరించగలదు. దీనివెల ఎనిమిది అణాలు.

గ్రంథాలయసూత్రాలు అను చిన్నపుస్తకమునందు గ్రంథాలయ నిర్వహణకు సంబంధించిన 5 సూత్రములు వివరించబడినవి.

గ్రంథాలయాల అభివృద్ధికి యీసూత్రాలు ఎంతైన నుపకరించగలవు. ఆదర్శవంతమైన గ్రంథాలయముల నిర్వహణకు యీ పుస్తకపఠనము అవసరము. దీనివెల 0-8-0 అణాలు.

తెలుగుపుస్తకాల వర్గీకరణము: అను చిన్నపుస్తకము గ్రంథాలయ శాస్త్ర వాఙ్మయము తెలుగులో వ్యాప్తినొందుటకు అనువుగా వ్రాయబడినది. విషయము గొప్పదయినా చిన్నపుస్తకంద్వారా దానినివెల్లడించడానికి గ్రంథకర్త సాహసించాడు. నేటిగ్రంథాలయ ఉద్యమస్థితినిబట్టి విషయపరిచయానికి ప్రస్తుతం యీగ్రంథం చాలుననను గ్రంథకర్త అభిప్రాయంతో మేము ఏకీభవిస్తున్నాము. దీనివెల 0-5-0 అణాలు.

మాపాఠాలు మొదటి, రెండవభాగములు: శ్రీ గోపలరాజు రామచంద్రారావు (గో.రా.) ప్రకాశకులు: గ్రంథాలయ పుస్తకశాల, పటమటపోస్టు, కృష్ణాజిల్లా. ఒక్కొక్క భాగంవెల 5 అణాలు.

## స్వీకారము

గృహలక్ష్మి

ఇవి వయోజన విద్యాబోధనకనువుగా వ్రాసిన పుస్తకములు. వయోజన విద్యావ్యాప్తికి గ్రంథకర్త చేయుచున్నకృషి అపారము. తన విశేషఅనుభవాన్ని వినియోగించి గ్రంథకర్త సులభపద్ధతులలో వయోజనుల విద్యాభ్యాసమునకు వీలుగా తయారుచేశారు.

వయోజనులు వార్తాపత్రికలనుచదివి అర్థముచేసుకొనకలుగుటకు తోడ్పడటమే యీగ్రంథముల ఉద్దేశ్యము.

వయోజనవిద్యావ్యాప్తి సందర్భమున నీగ్రంథములు ఎంతైన నుపకరించగలవు. కాని గ్రంథకర్త సూచనల ననుసరించి ఉపాధ్యాయులు శక్తివంచనలేకుండా ప్రజాసేవాదృష్టితో పనిచేసిననే కాని విశేషంగా సత్ఫలితాలు సమకూరవు. అన్నిటికంటె ముఖ్యమైన ప్రభుత్వసహాయము, ప్రోత్సాహము ఉన్ననేకాని ఉద్యమము ఫలవంతం కాజాలదు.

**ఊరుభంగము:** విద్వాన్ వేదము వెంకటకృష్ణశర్మగారు 66 స్వామిపిళ్లవీధి, చూళై, మద్రాసు. వెల 8 అణాలు.

శ్రీ భాసకవి రచించిన సంస్కృత నాటకమునకు ఇది ఆంధ్రానువాదము. ఇందలి కథావస్తువు భీముడు దుర్యోధనుని యూరువుల భంగ మొనర్చి తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుట.

శ్రీశర్మగారు బహు గ్రంథకర్త. సుప్రసిద్ధపండితులు. అనర్గళధారతో ఆంధ్ర గీర్వాణములందు కవిత్వము చెప్పకలిగిన కొలదిమందిలో నొకరు. వీరి మధురతరమైన కవిత్వము పండితులకు, కవులకు మాత్రము ఉద్దేశించ బడినదికాక జనసామాన్యానికి సయితము అందుబాటులో నుండునది. ఈగ్రంథకర్త యొక్క కవితానైపుణి యందలి ప్రత్యేకతను ఈగ్రంథము విదితము చేయుచున్నది.

మద్రాసు విశ్వవిద్యాలయము వారీగ్రంథమును పట్టపరీక్షకు పఠనీయముగా నిర్ణయించి శ్రీశర్మగారిని ఉచితరీతిని గౌరవించినారు.

ఇట్టి ఉత్తమ గ్రంథము లనేకములను రసవంతముగా రచించి భాషాసేవకులుగా ప్రజల గౌరవాభిమానములకు విశేషముగా నీ గ్రంథకర్త పాత్రులు కాగలుగుదురని మా విశ్వాసము.

**భామినీవిలాసము:** విద్వాన్ వేదము వెంకటకృష్ణశర్మగారు, 66 స్వామిపిళ్లవీధి, చూళై, మద్రాసు. వెల 3 రూపాయలు.

పండితరాయల సంస్కృత గ్రంథము నాంధ్రీకరించి తెలుగువారి కందిచ్చి శ్రీశర్మగారు మహోపకార మొనర్చిరి. భామినీవిలాసమును యిదివరకే పెక్కుమంది తెలిగించిరి. కాని యీగ్రంథములో మూల సంస్కృత శ్లోకాలను ముద్రించి వానిసరసనే తమ ఆంధ్రానువాదమునుకూడ పొందుపరచుట యీ గ్రంథమున కొక ప్రత్యేకత.

ఇందలి పద్యములు అనువాదముగా దోపక స్వతంత్రములట్లు తోచుచున్నవి. మూలశ్లోకములలోని భావములు రసపరిపుష్టితో పద్యములు ఒప్పుచున్నవి.

అనువాదము ప్రశస్తమయినది. కవిత్వము అనర్గళము, మధురము, హృదయరంజకముగా నున్నది. పద్యములు సరళమైన ధోరణి కలిగి తెలుగు నుడికారముతో గూడి ముచ్చట గొలుపుచున్నవి.

ఈగ్రంథరచన శ్రీశర్మగారికి విశేషకీర్తి, ప్రతిష్ఠల నార్జించి పెట్టగలదు. ఇంకను వీరు ఉత్తమ కావ్యములను రచించి తెలుగు భాషాసంపదాభివృద్ధికి తోడ్పడుదురుగాక.

---

## శ్రీ ఖరనామ సం॥ర కార్తీక మార్గశిర మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | శు | తృ 45-10 మృ 48-3 పునస్తాజ్యాభావః |
| | 17 | శ | చ 49-40 ఆ 53-54 ది 11-6 |
| | 18 | ఆ | పం 54-4 పున 59-49 ది 26-52 |
| | 19 | సో | ష 59-5 పుష్య 60-10 ది 21-48 |
| నవంబరు నెల | 20 | మం | స 60-10 పుష్య 5-46 రా 12-39 సావిత్రికల్పం |
| | 21 | బు | స 3-38 ఆశ్రే 11-14 రా 15-33 |
| | 22 | గు | అ 3-19 మఘ 16.3 రా 9-22 |
| | 23 | శు | న 10-6 పూఫ 19-59 రా 10-48 |
| | 24 | శ | ద 11-39 ఉఫ 22-33 రా 16-24 |
| | 25 | ఆ | ఏ 12-24 హ 24-39 రా 12-24 సర్వోపవాసః |
| | 26 | సో | ద్వా 11-44 చి 25.13 రా 11 8 |
| | 27 | మం | త్ర 9-50 స్వా 24 34 రా 10-13 మాసశివరాత్రి |
| | 28 | బు | చతు 6.30 విశా 24-46 రా 4-24 |
| | 29 | గు | ● అమా 2-32 ఏష్యా 54.44 అనూ 19-59 రా 5-13 |
| | | | మా ర్గ శి ర మా స ము |
| | 30 | శు | శుక్లవిదియ 50-29 జ్యే 16 24 రా 3 10 చంద్రోదయః |
| 1951 సం॥ | 1 | శ | తృ 45-2 మూ 12.12 ది 8.29 |
| | 2 | ఆ | చ 9-3 పూషా 3-39 ది 26.3 |
| | 3 | సో | పం 32-51 ఉషా 3 1 ది 12-18 |
| | 4 | మం | ష 26-58 ధ 54-55 ది 8-6 సుబ్రహ్మణ్యషష్ఠి |
| | 5 | బు | స 21-43 శత 51-43 ది 11-59 |
| | 6 | గు | అ 17-29 పూభా 49.40 ది 7-14 తిథిద్వయం కాలభైరవాష్టమీ బుధాష్టమీ |
| | 7 | శు | న 14-24 ఉభా 48-36 ది 13-14 |
| | 8 | శ | ద 11-45 రే 48-41 ది 18-38 |
| | 9 | ఆ | ఏ 10-48 అ 50-0 రా 12-3 సర్వోపవాసః |
| డిశంబరు నెల | 10 | సో | ద్వా 11-12 భ 52-30 ది 15-0. వాసుదేవ ద్వాదశీ. |
| | 11 | మం | త్ర 12-44 కృ 56-7ది 24-18 హనుమద్వ్రతం. |
| | 12 | బు | చ 15-23 రో 60-10 రా 11-19 పాషాణ చతుర్దశీ చంద్రపూజా. |
| | 13 | గు | ○ పూ 18-59 రో 0-28 ది 15-43 శూన్యతిథిః, దత్తాత్రేయ జయంతి. |
| | 14 | శు | కృష్ణపా 23-44 మృ 5-48 ది 28-53. |
| | 15 | శ | వి 27-56 ఆ 11-45 రా 16-59. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

Regd No.M.4793, GRIHALAKSHMI 15-11-1951